# పుంభావ సరస్వతి - పుట్టపర్తి


రచన

డా. పుట్టపర్తి నాగపద్మిని





యువభారతి

తెలంగాణ సారస్వత పరిషత్ భవనం

తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

**Pumbhava Saraswathi - Puttaparthi**
by
Dr. Puttaparthi Nagapadmini

© **YUVABHARATHI**
**యువభారతి**

**ప్రచురణ : 193**

ప్రథమ ముద్రణ : అక్టోబరు, 2019

ప్రతులు : 500

వెల : 50/-

ప్రతులకు :
**యువభారతి**
తెలంగాణ సారస్వత పరిషత్ భవనం
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001

డిటిపి :
**మాధవీగ్రాఫిక్స్**
మల్కాజిగిరి, హైదరాబాద్ - 47
ఫోన్ : 9908001724
E-mail : madhavigraphicsc@gmail.com

ముద్రణ :
**ఆకృతి ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైదరాబాద్.
ఫోన్ : 040-66626475



## "సరస్వతీ పుత్రుని సాహితీ మూర్తిమత్వం"

"భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుకై" అన్నాడు నన్నయ భట్టారకుడు. "సాహిత్యం జగతికి హితం చేకూర్చేందుకే!" అని ఆనాడే నిర్దేశించాడు ఆదికవి. మానవ మూల్యాలను నిలబెట్టుతూ, సమాజంలో మంచితనాన్ని పెంపొందించడంలో సాహిత్యం ప్రముఖ పాత్ర వహిస్తుందని "యువభారతి" ఆది నుండి విశ్వసిస్తున్నది.

ఆ లక్ష్యంతోనే అనేక సమాజోపయుక్తమైన సాహిత్య కార్యక్రమాలను నిర్వహించడంతో బాటు, పూర్వకవుల సాహితీ సమాలోచన గ్రంథాలను ప్రచురిస్తూ, ఆ సాహితీ పరిమళాలను నవీనులలో వ్యాప్తి చేసేందుకు కృషి చేస్తున్నది మా యువభారతి. ఆ పరంపరలో భాగంగా వెలువరిస్తున్న ఈ "పుంభావ సరస్వతి - పుట్టపర్తి" గ్రంథంలో "సరస్వతీ పుత్ర" పుట్టపర్తి నారాయణాచార్యుల వారి బహుముఖీనమైన సాహితీ ప్రతిభా మూర్తిమత్వాన్ని, వారి కుమార్తె డా. శ్రీమతి పుట్టపర్తి నాగపద్మిని గారు విశదంగా వివరించారు. ఆ విధంగా కొంత మేర పితౄణము తీర్చుకొన్న ఆమెను అభినందిస్తూ, ధన్యవాదాలను తెలియజేసుకొంటున్నాం. మా గ్రంథాలను విశేషంగా ఆదరించిన పాఠక మహాశయులు, సాహిత్య ప్రియులు ఈ గ్రంథాన్ని కూడ ఆదరిస్తారని ఆశిస్తున్నాం.

**డా. ఆచార్య ఫణీంద్ర**
అధ్యక్షులు
"యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ

# దుహిత కలాన మహిత సరస్వతీమూర్తి

ఆయన సరస్వతీ పుత్ర బిరుదాంకితులు. కానీ సాక్షాత్తు పుంభావ సరస్వతి. బహుభాషా పరశేషభోగి. సంప్రదాయ వడహాల శ్రీవైష్ణవ పండిత కుటుంబంలో జన్మించి 'శివతాండవం' రచించి ఆయన జగద్విఖ్యాతిగాంచడం విశేషం. 'శివతాండవం' అనగానే ఆయనెవరో సాహిత్య ప్రపంచం తటాలున గుర్తిస్తుంది. అవును ! ఆయన శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు గారు. జ్ఞానపీఠాలకు అందనంత ఎత్తుకెదిగిన 'సుజ్ఞానఖని' పుట్టపర్తివారు. అగ్నివీణ, మేఘదూతం, అస్తసామ్రాజ్యం, జనప్రియ రామాయణం, శ్రీనివాస ప్రబంధం, అలాగే సంస్కృతంలో శివకర్ణామృతమ్, త్యాగరాజ సుప్రభాతమ్, అగస్త్యేశ్వర సుప్రభాతమ్, శ్రీశివలీలాస్తవమ్, మల్లికార్జున సుప్రభాతమ్, ఆంగ్లంలో లీవ్స్ ఇన్ ద విండ్, ది హీరో, భాగవత పదవ అధ్యాయం, అభయ ప్రదానము, హరిదాసి, ప్రతీకారము వంటి తెలుగు చారిత్రక నవలలు, ప్రబంధ నాయికలు, రాయలనాటి రసికతా జీవనము, విజయనగర సామాజిక చరిత్ర, మహాభారత విమర్శనము, వ్యాససంపుటి, వసుచరిత్ర సాహితీ వైభవము, తెలుగు వీరులు, వాగ్గేయకారులు, పదకృతి సాహిత్యం వంటి విమర్శనా గ్రంథాలు, వందలాది భక్తి సంకీర్తనలు, వివిధ భాషలనుండి అనువదించిన బుద్ధభగవానుడు, సరస్వతీ సంహారము, తీరనిబాకీ, చారుదత్తము, స్వర్ణపత్రములు, సంఘర్షణ వంటి అనువాద గ్రంథాలు... ఇలా ఎన్నో ఎన్నెన్నో !! శతాధిక గ్రంథాలు... అపారకావ్య రచనాంబుధి పుట్టపర్తి. ఆయన పన్నెండేళ్ళ ప్రాయంలో రచించిన మొట్టమొదటి కావ్యం 'పెనుగొండ లక్ష్మి'. తదనంతరం వారికే విద్వత్ పరీక్షకు పాఠ్యగ్రంథమైన అపురూప సందర్భం వారిది. ఎందరో సాహితీ విద్వన్మూర్తుల గ్రంథాలకు పీఠికలు ప్రసాదించారు. 'జీవితం-అనుభవాలు' స్వీయచరిత్రను 'లత' మాసపత్రికలో, ఆంధ్రప్రభలో 'రాళ్ళుగా మారిన రాయలసీమ రతనాలు', ఆంధ్రజ్యోతి వారపత్రికలో 'పద్యంబొక్కటి చెప్పి' కాలమ్స్‌గా రాశారు. తమ జీవిత చరమాంకంలోనూ తిరుమల తిరుపతి దేవస్థానం వారి అభ్యర్థన మేరకు శ్రీమద్భాగవతానికి వ్యాఖ్యారచన సమకట్టారు.

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారితో యువభారతి సంస్థ అనుబంధం ఒక చిరస్మరణిక 'లహరి' ప్రసంగ పరంపరలను ప్రారంభించి కావ్యలహరి తరువాత 1972లో 'చైతన్యలహరి' ప్రసంగపరంపరను యువభారతి జూలై మాసంలో నిర్వహించినపుడు తిక్కన, పాల్కురికి సోమనాథునిపై ప్రసంగాల అనంతరం మూడవ సమావేశంలో 23 జూలై 1972 ఆదివారం నాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు వేదికగా సాహితీసమరాంగణ సార్వభౌములు శ్రీకృష్ణదేవరాయలు గురించి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు చేసిన ప్రసంగం ప్రేక్షక



శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేసింది. సాహితీ సమరాంగణ సార్వభౌముడన్న బిరుదు రాయలకే అచ్చంగా తగినదనీ, ఎందుకంటే రాజకీయంగా చేసే యుద్ధాలలో భృత్యుల విజయాలే స్వామికి చెందుతుంటాయని పుట్టపర్తివారు చమత్కరించారు. రాయలకు పదిభాషలు వినే అదృష్టం, పరిశ్రమ చేసే అదృష్టం లభించాయనీ అరవ, కన్నడ భాషల్లో నిష్ణాతుడనీ, సంస్కృతంలోనే తొలుత గ్రంథ రచన చేసిన రాయలు తెలుగులో ఆముక్తమాల్యద ఒకటే రచించాడనీ, అశోకుని యుద్ధంలా అతని ఆముక్తమాల్యద ఒకటే రచించాడనీ, అశోకుని యుద్ధంలా అతని ఆముక్తమాల్యద తొలిదీ చివరిదీ అయిన రాయల తెనుగు రచన అనీ ఆయన పేర్కొన్నారు.

వైష్ణవ సంప్రదాయాలను, ఆళ్వారుల మధుర వాత్సల్య భక్త్యాది పాశురములను, ద్రావిడ సంస్కృతిని చక్కగా అర్థం చేసుకుని, జీర్ణించుకోగలిగినందునే ఆముక్తమాల్యద విరాజిల్ల గలిగిందనీ, ద్రావిడ సంస్కృతిని సమగ్రంగా ప్రతిబింబించినది కేవలం ఆముక్తమాల్యదేననీ, రాయలు చేసిన వర్ణనలు ఇతర కవుల్లో మృగ్యమనీ వారు వివరించారు. లోకజ్ఞానం, జీవిత సమగ్ర దర్శనం, పాండిత్య వీరత్వం కవితనమని పుట్టపర్తివారు పేర్కొంటూ – పెద్దన, తెనాలి మొదలయిన కవులు బ్రతుకుకు మాత్రమే వైష్ణవాన్ని ఆశ్రయించినవారనీ, వైష్ణవమత సంప్రదాయాలు రాయలకు తెలిసినంత ఇతరులకు తెలియదనీ, అతడు స్వాభావికంగానే వైష్ణవుడనీ శ్రీకృష్ణదేవరాయలపై, ఆముక్తమాల్యదపై గంటపైగా అద్భుత ప్రసంగాన్ని ఆనాడు అందించారు పుట్టపర్తివారు. అదొక మరపురాని సభ.

అంతసేపు ప్రసంగించాక కూడా యువభారతి సమావేశకర్త, సంస్థ మూలాధారి నాడి అయిన ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారు అభ్యర్థించగా 'ఇప్పుడా? ఏమిటబ్బా' అంటూనే యువభారతి మాట మన్నిస్తూ – తమ 'శివతాండవం' కావ్యగానంచేసి ప్రేక్షకశ్రోతలను ఆనందాంబుధిలో ఓలలాడించి, మమ్ములను ధన్యులను చేశారు. ఆ రోజుల్లో వారిని 151 రూపాయలతో చందన తాంబూలాలతో, శాలువాతో సత్కరించుకోవడం, ఆయన స్వీకరించడం యువభారతి భాగ్యసంపద ! తదాదిగా వారితో యువభారతి అనుబంధం పెనవేసుకుంది.

1974లో యువభారతి పదకొండవ వార్షికోత్సవ కార్యక్రమాలు 'ప్రతిభాలహరి' – ఉపన్యాస పరంపరతో ప్రారంభించుకున్నప్పుడు తొట్టతొలుతగా కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవిపై శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి (6.10.1974) ప్రసంగమే ఏర్పాటుచేసాం. వారి ప్రసంగంతో వేలాది శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేశారాయన. అదే సభలో సుధామ, డా॥ నాగినేని భాస్కరరావుల 'మేం' కవితాసంకలనం ఆవిష్కరణ జరిగింది. ప్రస్తుతం యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకుడినైన భవదీయుడు సుధామ తొలి

కార్టూన్ పుట్టపర్తివారు తమ స్వీయచరిత్ర రాసిన 'లత' మాసపత్రికలోనే జనవరి 1969లో ప్రచురితమైంది.

యువభారతి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి జీవిత–సాహిత్య విశేషాలను ఈ తరం పాఠకులకు అందచేయాలనే సంకల్పం ప్రకటించినప్పుడు పుట్టపర్తి నారాయణాచార్యులవారి కుమార్తె, విదుషీమణి, దూరదర్శన్ విశ్రాంత అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టర్ శ్రీమతి పుట్టపర్తి నాగపద్మినిగారు మా అభ్యర్థనను మన్నించి 'పుంభావ సరస్వతి – పుట్టపర్తి' అనే ఈ గ్రంథం రచించి ఇచ్చారు. ఒక సాహిత్య విరాణ్మూర్తిని 'కొండ అద్దమందు కొంచెమై ఉండదా' అన్న తీరున ఎంతో సమగ్ర సుందరంగా శ్రమకోర్చి సంతరించి ఇచ్చిన నాగపద్మినిగారికి మా కృతజ్ఞతాభివందనాలు. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో శ్రీమతి పుట్టపర్తి నాగపద్మినిగారు అశేష శ్రోతలకు ఎలా పరిచితులో, తండ్రిగారి వారసత్వాన్ని అందిపుచ్చుకుని ఒక కవయిత్రిగా, రచయిత్రిగా, విమర్శకురాలిగా, సాహితీవేత్తగా పాఠకలోకానికి పరిచితులే! డాక్టర్ నాగపద్మినిగారు ఆంధ్రాంగ్ల హిందీ, తమిళ, కన్నడాది భాషల్లో నిష్ణాతులు. అనేక హిందీ రచనలూ చేయడమే గాక తిరుమల తిరుపతి దేవస్థానం శ్రీవారి బ్రహ్మోత్సవాల వంటి అపూర్వ సందర్భాలకు హిందీలో ప్రత్యక్ష వ్యాఖ్యాత్రిగా కూడా ప్రసిద్ధులు. తండ్రిగారి సాహిత్యాన్ని, అముద్రిత రచనలనూ ఈ తరానికి వెలుగులోకి తెస్తూనే, తాము స్వయంగా రచయిత్రిగా, అనువాదకురాలిగా, వక్తగా, వ్యాఖ్యాత్రిగా, విదుషీమణి అయిన సాహితీవేత్తగా, స్నేహశీలిగా పేరొందినవారు. సాహితీ మంజూష, వ్యాసవాటిక, తెలుగు హిందీ రామ కావ్యాలలో సీత, తెలుగింటి సిరులపంట, సద్దుల బతుకమ్మ – సంపతి గౌరమ్మ, హద్దులు (కవితా సంకలనం), గీతారామం (లలిత గేయాలు), ఎన్నినీళ్ళో (అనువాదకథా కదంబం), భాషాపరశేషభోగి పుట్టపర్తి వంటి పలు గ్రంథాలను వెలువరించారు. నిరంతర సాహితీ చైతన్యంతో సాగుతున్నారు. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారి చాటువులతో సహా ఆ మహనీయుని జీవిత, సాహిత్య విశేషాలను క్లుప్త సుందరంగానూ, సమగ్రంగానూ తెలిపే ఈ గ్రంథం రచించి ఇచ్చిన డా॥ నాగపద్మినిగారికి అభినందనలు తెల్పుతూ ఈ గ్రంథం పఠితృలోక సమాదరణ పాత్రం కాగలదని విశ్వసిస్తున్నాం. శుభం భూయాత్ !

సదా మీ

**సుధామ** *(9849297958)*

*యువభారతి ప్రధాన సంపాదకులు*



# పుంభావ సరస్వతి – పుట్టపర్తి

సరస్వతీపుత్ర పద్మశ్రీ డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులవారు అద్వితీయ ప్రతిభా మూర్తులు. అంబుధుల అగాధాలనుంచి, రత్నరాసులనూ, అంబరం అంచులనుంచీ నక్షత్రకాంతులనూ అందుకొనగలిగిన పరిశ్రమస్ఫూర్తి వారిది. ప్రాచీన సాహిత్యాన్ని ఆపోసనపట్టి, నవీన సాహిత్యాన్ని సమాదరించి, రెండింటికీ సేతువుగా నిలిచినవారు. పదకవితలను పుక్కిటా ప్రాకృత కవితలను పిడికిటా నింపుకుని, భక్తికీ రక్తికీ సైతం ప్రతినిధిగా పేరెన్నికగన్నవారు, గద్యం–పద్యం, వ్యాఖ్య–విమర్శ, నాటకం–నవల, గేయం– ఉపోద్ఘాతం, పీఠిక–వ్యాఖ్య, యిలా ఏదైనా సాధికారంగా, ప్రతివిమర్శకు తావులేకుండా వ్రాయటమే వారి పద్ధతి!

'అహమేవ పండితః' 'అహంపండితః' 'నాహం పండితః' అన్న మూడు విభాగాలుగా తమ జీవితాన్ని విశ్లేషించుకొనవచ్చునని అనేక సందర్భాలలో వారే నుడివినట్లు 'సరస్వతీపుత్ర' నుండి 'పుంభావ సరస్వతి'గా రూపొందినవారి జీవన క్రమమిది.

**జీవిత విశేషాలు :**

1914 ఆనందనామవత్సర చైత్రశుద్ధ విదియకు సరియైన మార్చి 28 నాడు శనివారం రాత్రి పదిగంటల ముప్పై నిమిషాలకు శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, శ్రీమతి మెండమ్మ (అలమేల్మంగకు అచ్చతెనుగు అనువాదం)లకు పెనుగొండ తాలూకా, చియ్యేడు గ్రామంలో వారు జన్మించారు. కృష్ణదేవరాయలవారి గురువు తాతాచార్యుల వంశం, సంప్రదాయ వడహల శ్రీ వైష్ణవ కుటుంబం, పండితవర్యులైన తల్లిదండ్రుల అంశవల్ల పుట్టపర్తి చిన్ననాటి నుండే ఆశు కవితలల్లేవారట! 12వ ఏటనే 'పెనుగొండ లక్ష్మి' అన్న కావ్యాన్ని రచించారు. తల్లి ఆకస్మిక మరణం, తండ్రిగారి వైరాగ్య ధోరణివల్ల చిన్ననాడు పెంకెతనంతో పరిఢవిల్లినా అటుతరువాత, తండ్రిగారి ప్రభావం వీరిపై బాగా పడింది.

ఆ. వెర్రి మనస ఏల వేకారెదవు పోలు
పొందు లేని సుఖములంద దలచి,
అందములకు నీవు చందమామ నిజంబు,
ముట్టగలిగి, ముద్దు పెట్టగలవె?

కం. పరదారలు, పర ధనముల,
పర సుఖముల తెరవులేని పరమ పవిత్రుం
దరుదెంచునె, పరికించునె,
కరుణించునె నన్నటంచు గంగ దలంచున్..

ఇటువంటి రసికతతో కూడిన వేలాది పద్యాలు వారి తండ్రిగారు ఆశువుగా చెప్పేవారట తండ్రి శ్రీనివాసాచార్యులవారు!! ఆ రోజుల్లో పెనుగొండ, పుట్టపర్తి ప్రాంతాల్లోని సాహితీ పిపాసువులు 'అభినవశ్రీనాధుడని వారిని పిలిచేవారట!! కానీ, వాల్మీకి, కాళిదాసులతో పోల్చుకుంటే మనమెంత, మనరచనలేపాటి? అని తమ రచనల పట్ల ఉదాసీన భావముండటం వల్ల తండ్రిగారేనాడూ తమ పద్యాలను ముద్రించేందుకు ఇష్టపడనేలేదట!! (జీవితం అనుభవాలు – లత మాసపత్రికలో (1967) ధారావాహికంగా వచ్చిన స్వీయచరిత్రలో పుట్టపర్తి)

పోయి సూసొత్తాము రారే మీరంత
రాయలా నగరానికీ..
విజయనగరంలోన వేడుకైతాదంట,
ప్రజలు సంతోషముతొ పలుమందొత్తారంట..
తప్పెట్లు, నాగార్లు, తాజా మరుపూండ్లంట,
ఎప్పుడు చూసినా చప్పుడౌతాదంట,
పప్పు బువ్వా కలిపి పవలెల్ల రేయెల్ల
సప్పరలో బంచి సాగనిస్తారంట...
పెదపెద్ద పైరైన పెబువులొత్తారంట,
బలు సదువు సదివిన బ్యామ్మలొత్తారంట,
యుద్దాలు పట్టేటి ఈరులొత్తారంట
ఇద ఇదాలా మంచి ఇంతలైతాదంట,
గుట్టలల్ల తిరిగె గున్న ఏనుగులంట
కట్టలు దాటేటి పొట్టి గుర్రాలంట,
బట్టలూ సొగసుగా గట్టె ఆడోల్లంట
పట్టపగలైనట్టు పెట్టె దీపాలంట
పోయి సూసొత్తామురారే..మీరంత
రాయలా నగరానికీ...



తన చిన్న నాట, విజయనగరోత్సవాలు ప్రతి ఏటా నిర్వహించేవారనీ, అలా విజయ నగరోత్సవాలు జరిగినప్పుడు ఒక సారి, తమ తండ్రిగారు యీ పాటను వ్రాశారనీ, గొంతెత్తి ఆ పాటను ఆనందోద్వేగాలతో పాడుతుంటే, ప్రజలు పరవశంతో ఊగిపోయేవాళ్ళనీ, కరతాళ ధ్వనులు మిన్ను ముట్టేవనీ, పుట్టపర్తి తమ తండ్రిగారి స్మృతులను అనేక వేదికలపై పంచుకునేవారు.

అంతేనా? పౌరాణిక, చారిత్రక నాటక ప్రదర్శనలు జోరుగా సాగేవారోజుల్లో!! సర్వశ్రీ స్థానం నరసింహరావు, బళ్ళారి రాఘవ, పులిపాటి వెంకటేశ్వర్లు, టి.వీ. సుబ్బారావు, ముప్పిడి జగ్గరాజు, పారుపల్లి మొదలనవారంతా పేరుమోసిన గాయకులూ, నటులూ!! సురభి కంపెనీవారు పెనుగొండలో చాలారోజులు మకాం వేసి, సారంగధర, చింతామణి, గయోపాఖ్యానం,పాదుకాపట్టాభిషేకం వంటి నాటకాలెన్నో ప్రదర్శించేవారు. ఆ నాటకాల పట్ల ఆకర్షితులై, దశరధుడు, ద్రోణుడు, భీష్ముడూ, రాజరాజనరేంద్రుడు వంటి పాత్రలు నాటకాల్లో వేసి, మెప్పించేవారట పుట్టపర్తి వారి తండ్రి గారు !!'నాటకాల్లో వేయటమంటే, అభ్యుదయ పథంలో ఒక అడుగు ముందుకువేసి నడుస్తున్నట్టుగా అందరూ భావించేవారట!! ఇంకేముంది?? పెద్దలకోసం ఒక నాటక సమాజం, పిల్లలూ, యువకులకో నాటక సమాజం ఉండేవప్పట్లో పెనుగొండలో!! వాటి నిర్వహణలో సంవత్సరానికి రెండు మూడు నాటకాలు ప్రదర్శించేవారు. అలా, తండ్రిగారి ప్రభావంతో మొట్టమొదట పుట్టపర్తివారు, గయోపాఖ్యానంలో చిత్రలేఖ పాత్రను వేశారట!! అంతేకాక, లెగ్ హార్మోనియం బాగా వాయించే చంద్రారెడ్డీ సాయంతో హార్మోనియం కూడా నేర్చుకున్నారట పుట్టపర్తి వారు!! ఉచ్చారణను సరిచేసే వీధి బడి ఉపాధ్యాయుడు మాధవయ్య పంతులు శిక్షణ నాటక ప్రదర్శనలో బాగా తోడ్పడేదట!! ఇలా చుక్కలూరు రామాయణం, మోక్షగుండ రామాయణాల్లో బాల పుట్టపర్తి సీతగా నటించారట కూడా!! మధుర ప్రాంతం వారైన సుందరం పిళ్ళైగారు, కొన్ని రోజులు పెనుగొండలో ఉన్నపుడు, అభినయంలో మెలకువలు వారివద్దే నేర్చారట కూడా!! తంజావూరు నాట్య సంప్రదాయానికి వారు చెందినవారు కావటం వల్ల, నాట్యం కూడా నారాయణాచార్యుల వారిని ఆకర్షించింది. పెనుగొండలో రంజకం మహాలక్ష్మమ్మ గారి వద్ద, నాట్యం, పక్కా హనుమంతాచార్యులవారివద్ద సంగీత శిక్షణ తదుపరి జీవితాన సువిఖ్యాత రచన శివతాండవానికి పునాదులుగా నిలిచాయి మరి!!

పెనుగొండ సబ్ కలెక్టర్ గారి సతీమణి వీ.జే.పిట్. ఆమె భర్త అక్కడే చనిపోయాడు. అతని జ్ఞాపకాలతో, ఆమె ఇంకా అక్కడే ఉండేది. ఆవిడ,కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో రాబర్ట్

బ్రౌనింగ్ మీద పరిశోధన చేసి డాక్టరేట్ తీసుకుంది. ఆమెతో పరిచయమేర్పడటం ఎలా జరిగిందో తెలియరాలేదు కానీ, పుట్టపర్తి వారికి ఆవిడ షేక్స్పియర్ నాటకాలన్నీ పాఠం చెప్పింది. దానికి బదులుగా, బాల నారాయణుడు, ఆమెకు తెలుగు నేర్పించాలని ఒప్పందం. అలా ఏర్పడిన ఆంగ్ల సాహిత్య పరిచయంతో, తరువాత కాలంలో, షెల్లీ, కీట్స్, ఎమర్సన్ వంటి రచయితలనూ ఒక పట్టుపట్టారు, పుట్టపర్తి వారు. కానీ ఆమె చెప్పిందట, 'నీవు ఇంగ్లీష్ బాగా చదువు కానీ ఇంగ్లీష్ లో రచనలు చేసే ప్రయత్నం చేయకు. ఎందుకంటే, మీకు ఎంత తల్లకిందులుగా తపస్సు చేసినా, ఆంగ్ల రచయితలవలె వ్రాయటం పై పట్టు దక్కదు. అంతకంటే, ఆంగ్లం బాగా చదివి, ఆ విజ్ఞానంతో తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేసే ప్రయత్నం చేయి..అంతే..' అని!! అందుకే చాలా రోజులామె హెచ్చరిక గుర్తుండిపోయి, ఆంగ్లంలో రచనలు చేసేందుకు సాహసించలేదట!! కానీ, కలం ఊరకుండనివ్వలేదు. 'లీవ్స్ ఇన్ ది విండ్' అనే కవితాసంగ్రహం వ్రాసి, చాలా రోజులు బయట పెట్టనేలేదట! ఏదో కారణంగా అది సరోజినీ నాయుడు గారి సోదరుడు శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ్ దృష్టికి వెళ్ళి వారు ప్రశంసల వర్షం కురిపించినప్పుడు, మిత్రుల ఒత్తిడితో, ప్రచురించేందుకు అంగీకరించటమైందని పుట్టపర్తి వారే తరువాతి కాలంలో చెప్పుకున్నారు. (సరస్వతీపుత్రునితో సంభాషణలు)

హరికథలు సొంతంగా వ్రాసుకుని చెప్పటంలో నారాయణాచార్యులవారు దిట్ట. పదునాలుగేళ్ళ వయసునుండీ అలవడిన యీ విద్య, దాదాపు పదహైదేళ్ళు వీరిని కనిపెట్టుకునే ఉంది. హరవిలాసం, తులసీదాసు, పండరి మహిమ, గోరా కుంభారు, భక్త జయదేవ, భక్త తుకారాం, చొకామీళ, సక్కూబాయి వంటి భక్తి రస ప్రధానాలే కాక, బోసు చరిత్ర, మహాత్మాగాంధీ జీవితం వంటివీ అప్పటి పుట్టపర్తికి హరికథకులుగా గొప్ప పేరు తెచ్చి పెట్టినవనే చెప్పాలి.

ఎనిమిదవతరగతిలో లెక్కల్లో తక్కువ మార్కులు రావటంవల్ల అనుత్తీర్ణు లయ్యారు. ఇక మళ్లీ ఆ చదువుకన్నా తిరుపతిలో శిరోమణి చదవటం యిష్టమైంది. కానీ ప్రవేశం దొరకలేదు. ఆత్మాభిమానం దెబ్బతిని ఆక్రోశం శ్లోకాలుగా విరుచుకుపడింది. ఆ శ్లోకాలు ప్రిన్సిపాల్‌గారి చెవినిబడ్డాయి. కోరుకున్న దానికంటే పై తరగతిలోనే ప్రవేశాన్నిప్పించాయి. తర్కం, వేదాంతం, వ్యాకరణం, అలంకారశాస్త్రాలు, వైష్ణవ, శైవాగమాల పఠనం, అవధానాలు, అప్పటి కవుల కవితాగానాలు, ఆంగ్లకవితా పఠనాలూ, తన "పెనుగొండలక్ష్మి" యివన్నీ



సహవిద్యార్థులలో పుట్టపర్తికి ప్రత్యేక స్థానాన్నే సంతరించిపెట్టాయి, వారి సహకారంతోనే పెనుగొండలక్ష్మి, షాజీ ప్రచురితమయ్యాయి. (1940 సం॥లో మద్రాస్ యూనివర్సిటీవారు 'షాజీ'ని పాఠ్యగ్రంథంగానూ పెట్టారు).

తిరుపతి ప్రాచ్య కళాశాలలో మానవల్లి రామకృష్ణ కవిగారు వీరికి పాఠాలు చెప్పేవారు. తర్క వేదాంతాలలో ముఖాముఖి చర్చల కోసం భారతదేశమంతటా పద్ధెనిమిది సార్లు విజయ యాత్ర చేసి 'మహామహోపాధ్యాయ' బిరుదు పొంది వచ్చిన కపిస్థలం దేశికాచార్యులవారు కూడా అదే కళాశాలలో పనిచేస్తుండటం వల్ల, పుట్టపర్తి వారు, తర్క వేదాంతాలలో సందేహ నివృత్తి కోసం వారి వద్దకు వెళ్ళేవారు. 'విశిష్టాద్వైత మార్తాండా, అన్న గ్రంథాన్ని రచించిన గొప్ప సంస్కృత పండితుడు, చక్రవర్తి రాజగోపాలాచారిగారివద్దకు కూడా అప్పుడప్పుడు వెళ్ళేవారు. నాగపూడి కుప్పుస్వామి గారు తెలుగులో మహోన్నత పండితుడు. వారి వద్దకు వెళ్ళే అలవాటున్న పుట్టపర్తివారిని అవధానిగా ప్రోత్సహించేవారట కుప్పుస్వామి గారు!! సాహిత్యోపాసనతోపాటూ, తన నటనానుభవానికి కూడా మెరుగులు దిద్దుకున్నారట తిరుపతిలో చదివే సమయంలో!! బొబ్బిలి యుద్ధం నాటకంలో పాపారాయుడు పాత్ర వేసి మెప్పించారట ఎన్నోసార్లు!! !

ప్రాచ్య పాఠశాలలో చదువుకుంటున్న రోజుల్లోనే, పుట్టపర్తి వారికి వివాహం చేయాలని తండ్రిగారు శ్రీనివాసాచార్యులవారు తలపెట్టారు. ఇష్టం లేకపోయినా తల వంచారు నారాయణాచార్యులవారు, తండ్రి పట్ల భయ భక్తుల వల్ల!! 23 ఫిబ్రవరి,1934 న కల్యాణమైంది.కానీ కొద్ది రోజుల తేడాలోనే, పెళ్ళికుమార్తె అమ్మగారు, పెళ్ళికుమార్తె, దగ్గరి బంధువులు కొంత మంది అకస్మాత్తుగా మరణించటంతో, పుట్టపర్తి వారికి జీవితం పైన వైరాగ్యమొచ్చేసింది. ఆత్మహత్య చేసుకోవాలని నిర్ణయించుకుని, పచ్చ గన్నేరు విత్తనాలు నూరుకుని తిన్నారట! మిత్రులకీ విషయం తెలిసి, వెంటనే మందులిప్పించారు. ఆపద తప్పింది కానీ దగ్గు విపరీతంగా పట్టుకుంది. శిరోమణి చదువు కూడా అటకెక్కింది. అదే సమయంలో ప్రాకృత సాహిత్యం వీరిని ఆకర్షించింది. దగ్గర బంధువైన రాళ్ళపల్లి ప్రోత్సాహం కూడా తోడైంది. (1952లో అనంతపురం పుర ప్రముఖుల సభలో 'ప్రాకృత కవిత సరస్వతి ' బిరుదు వీరిని వరించేంతవరకూ ఆ తరువాత కూడా ఆ అభిరుచి విస్తరించింది.)

పుట్టపర్తి ప్రథమ వివాహం సమయానికే పుట్టపర్తి ధూమపాన ప్రియులు. అది విఫలమైనప్పుడు, జీవితంపై విరక్తితో పచ్చగన్నేరు విత్తనాలు నూరుకుని త్రాగటం వల్ల

ఆరోగ్యం పాడైంది. పైగా ధూమపానం వల్ల వచ్చిన దగ్గొకటి!! వైద్యం తరువాత, తండ్రి పట్టుదల వల్ల ద్వితీయ వివాహం. వారి తదుపరి జీవితాన్ని కనక కాంతిమయం చేసేందుకై, 28-2-1935న ధన్నవాడ కిడాంబి కనకవల్లి పుట్టపర్తి నారాయణుని జీవితంలో ప్రవేశించింది.

ఆరోగ్య సమస్య వల్ల అత్తిల్లైన ప్రొద్దుటూరులోనే కొత్తల్లుడుగా పుట్టపర్తి కొద్ది రోజులున్నారు. పుట్టపర్తి వారి ప్రసంగాలను ఆకాశవాణి మదరాసు కేంద్రం ద్వారా చాలాసార్లు విని వారి ప్రతిభావ్యుత్పత్తులను తెగ పొగడుతూ ఉండే శ్రీ కొప్పరపు సుబ్బారావు గారు ప్రొద్దుటూరు వాస్తవ్యులే!! కొప్పరపు సుబ్బయ్యగారు, ప్రొద్దుటూరు టౌన్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ గా పనిచేశారు. ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులుగారి శిష్య రత్నం. అనాథ శరణాలయం, సేవాసదనం పాఠశాలను స్థాపించినవారు. బడుగు వర్గాల వున్నతికీ, హిందూ ముస్లిం సమైక్యతకూ కృషి సల్పిన వారు. బ్రిటిష్ ప్రభుత్వం 'రావుసాహెబ్..' బిరుదును కూడా తిరస్కరించిన దేశ భక్తుడు. అటువంటి నిస్వార్థ ప్రజాసేవకుడు, త్యాగమూర్తి కొప్పరపు సుబ్బారావుగారు, సాహిత్య ప్రియులై, పుట్టపర్తిని ఆదరించారు. కొప్పరపు వారు, ప్రొద్దుటూరు – రామేశ్వరం స్థానికోన్నత పాఠశాలలో మేనేజర్గా ఉండేవారు. ఇలా పరిచయం కాగానే, కొప్పరపు సుబ్బారావుగారు, పుట్టపర్తిని, అదే పాఠశాలలో ఉపాధ్యాయునిగా నియమించే యేర్పాటు చేశారు. ఆవిధంగా, ప్రొద్దుటూరు, పుట్టపర్తిని జీవితంలో మొట్టమొదటిసారి ఉద్యోగస్తుణ్ణి చేసి, అక్కున చేర్చుకుంది. మాసిక వేతనం పదిహేను రూపాయలు. అప్పటి నిరాడంబర జీవితంలో ఆ చిన్న జీతంతోనే భార్యాభర్తలు, పొదుపుగా జీవనం సాగిస్తుండేవారు. అందులోనుంచే, బీదవిద్యార్థులకు సహాయం చేయటం, ప్రతిరోజూ ఒక బీద విద్యార్థికి భోజనం పెట్టేవారట కూడా!!

1936 నాటికి దగ్గుతో విపరీతంగా బాధపడుతూ కూడా 'షాజీ' కావ్యాన్ని పూర్తిచేయటం, దాన్ని మదరాసు విశ్వవిద్యాలయం వారు ఇంటర్ మీడియట్ కు పాఠ్య గ్రంథంగా స్వీకరించటం కూడా జరిగింది. కవిగా పుట్టపర్తి కీర్తి మరింత విస్తృతి చెందింది. దాదాపు అదే సమయంలో, ప్రొద్దుటూరులోని కన్యకా పరమేశ్వరి స్థానికోన్నత పాఠశాలలో, తెలుగు ఉపాధ్యాయుడు శ్రీ రామాచార్యులు గారు మరణించటం వల్ల ఆ స్థానం ఖాళీ ఏర్పడింది. కొప్పరపు వారు, పుట్టపర్తిని అక్కడ నియమింపజేశారు. ఇప్పుడిక పుట్టపర్తి జీవితం ఒక గాడిన పడింది.

ఇదే సమయంలో పుట్టపర్తి జీవితంలో, ఆ మాటకొస్తే, యే కవి జీవితంలోనూ ఊహించని ఒక అపురూపమైన ఘట్టం జరిగింది. పుట్టపర్తి పన్నెండేళ్ళ వయసులో వ్రాసినదీ



(1926 ప్రాంతంలో) 1935 నాటికి తాడిపత్రి దేశబంధు ముద్రాక్షరశాలలో ప్రచురింపబడినదీ ఐన వారి ప్రప్రథమ కావ్యం 'పెనుగొండలక్ష్మి 'కావ్య సౌందర్యానికి మెచ్చి, దానిని మదరాసు విశ్వవిద్యాలయ అధికార బృందం అప్పటి విద్వాన్ పరీక్షకు పాఠ్య గ్రంధంగా నియమించింది. ఇది గమనించిన కొప్పరపు సుబ్బారావు గారు పుట్టపర్తికి ఒక సలహా ఇచ్చారు. అదే – తెలుగు ఉపాధ్యాయ వృత్తికి అవసరమైన విద్వాన్ పట్టాను పొందటం. మదరాసు విశ్వవిద్యలయంలో ప్రైవేట్ గా యీ పరీక్ష వ్రాయవచ్చును. విద్వాన్ పట్టా కోసం పరీక్షకు దరఖాస్తు పెట్టుకున్న పుట్టపర్తి ఆ పరీక్షలో పాఠ్య గ్రంధంగా తన 'పెనుగొండలక్ష్మి'ని తానే చదివి పరీక్ష వ్రాశారు. కానీ పరీక్షలో అనుత్తీర్ణులయ్యారు!! కారణం, పరీక్షకు కేటాయించిన మూడు గంటల్లోనూ, ఆ ప్రశ్న పత్రంలో పెనుగొండ లక్ష్మి పాఠ్యగ్రంథం నుండి ఇచ్చిన ప్రశ్న కొక్కదానికే మూడు గంటలూ వెచ్చించేసరికి పరీక్షాసమయం ఐపోయింది. వ్రాత పేపరును ఇచ్చివేయవలసి వచ్చింది. ఫలితం కేవలం ఆ ప్రశ్నకు రావలసిన అన్ని మార్కులూ వచ్చినా, అవి పాసు మార్కులన్ని లేకపోవటం వల్ల వారు విద్వాన్ పరీక్షలో ఫెయిల్ అయ్యారు. ప్రపంచ కవుల చరిత్రలో యే కవి జీవితంలోనూ జరుగని అపూర్వ సన్నివేశమిది. తదనంతరం, ఎవరో సహృదయ చక్రవర్తి యీ విషయాన్ని విశ్వవిద్యాలయ దృష్టికి తీసుకుని వెళ్ళటం, వారు పుట్టపర్తి ప్రతిభావ్యుత్పత్తులను గౌరవిస్తూ, తిరిగి వారిని ఉత్తీర్ణులుగా ప్రకటించటం జరిగింది. ఏది యేమైనా, పుట్టపర్తి జీవితం అసాధారణమైనదని, యీ సంఘటన చెప్పకయే చెబుతున్నది కదా!!

ప్రొద్దుటూరులో ఉన్న సమయంలోనే తనకు ఉద్యోగ భిక్ష పెట్టి తననాదుకున్న కొప్పరపు సుబ్బయ్యగారి హఠాన్మరణం, పుట్టపర్తిని కృంగదీసింది. అదే రాత్రి 'బాష్పతర్పణం' అన్న కావ్యంగా వారి అశ్రుగంగ ప్రవహించింది. (ప్రచురణ 1945) గుండె దిటవు చేసుకుని జీవితం కొనసాగిస్తూ, ప్రొద్దుటూరు అగస్త్యేశ్వరస్వామి దేవాలయంలో మండలదీక్ష బూనిన సమయాన అసదృశ కవితాధారతో ఆవిర్భవించిన శివతాండవ కావ్యం, అనతి కాలంలోనే అనేకానేక సాహితీ వేదికలపై, పుట్టపర్తి నాట్య, సంగీత కళలు తోడుగా ప్రదర్శనలకు నోచుకుంది, పుట్టపర్తి కీర్తి మకుటంలో ఒక కలికి తురాయిగా భాసించింది. (1948 ఫిబ్రవరి భారతి సంచికలో శివాలాస్యం లోని కొంత భాగం ముద్రితం)

ఈ లోగా, ఒక మహత్తరమైన అవకాశం తలుపు తట్టింది. అనాలోచితంగా దరఖాస్తు పెట్టుకున్న వెంటనే, అనంతపురం ప్రభుత్వ కళాశాలలో, అధ్యాపకునిగా, ఎటువంటి డిగ్రీ కూడా లేకుండానే నియామకమది!! అలా, పుట్టపర్తి అనంతపుర వాసం మొదలైంది. అప్పటికే

వారి సాహిత్య విమర్శ గ్రంథం 'ప్రబంధ నాయికలు' బీ.యే. పరీక్షకు పాఠ్యగ్రంథంగా (1945లో) సాహిత్యోపాసకుల మన్ననల నందుకుంటున్నది. (మొదటి ప్రచురణ వృష నామవత్సరం 1941- రాళ్ళపల్లి వారి పుష్య శుక్ల 11 నాటి ఉపోద్ఘాతం తో) అందులో పుట్టపర్తివారు ప్రబంధ నాయికలైన గిరిక, సత్యాదేవి, ప్రభావతి, వరూధిని పాత్రలను సరిక్రొత్త రీతిలో పరిచయం చేసిన పద్ధతి, విద్యార్థులను విపరీతంగా ఆకర్షించింది. దీనికి తోడు, ఆచార్యులవారి సంగీత నాట్య సమ్మిళిత శివతాండవ ప్రదర్శనా పాటవం!! దీనికితోడు వారి స్ఫురద్రూపం. కంచు కంఠం. డిగ్రీ లేకున్నా, విద్యార్థులపాలిటి అయస్కాంతశక్తిగా ఉన్న పుట్టపర్తి వైభవాన్ని చూస్తుంటే, అప్పటి ఇతర లెక్చరర్లకూ, బ్రిటిష్ అధికారి ఐన ప్రిన్సిపాల్ కే.జే.పీ.మీనన్ గారికి ఏమాత్రం నచ్చలేదు. ప్రబంధ నాయికలు పాఠాన్ని పుట్టపర్తివారే చెప్పాలంటూ విద్యార్థులూ, రచయితే పాఠం చెప్పకూడదని కళాశాల యాజమాన్యమూ!! రాత్రుళ్ళు, పుట్టపర్తి శివతాండవ గానంలో తన్మయమయ్యే విద్యార్థులను చూసిన ప్రిన్సిపల్, పుట్టపర్తిని ఒక సంఘ విద్రోహిగా చిత్రీకరించి బ్రిటిష్ ప్రభుత్వానికి ఫిర్యాదు చేశాడు. భారత స్వాతంత్ర పోరాట దినాలవి!! శ్రీ రామ కృష్ణ పరమహంస, వివేకానంద స్వామి, గాంధీజీ..ఇలా అందరినీ దూషిస్తూ ఉండేవాడా అధికారి!! దేశభక్తిని నరనరాన నింపుకున్న పుట్టపర్తి, ఇక ఆ దేశ ద్రోహి పాలనలో మనటం ఇష్టంలేక,విద్యార్థులు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నా, తానే రాజీనామా చేసి తిరిగి ప్రొద్దుటూరికి చేరుకున్నారు, అనతి కాలం లోనే!!

ప్రొద్దుటూరికి తిరిగి వచ్చినా, పాద్యము (పద్య కృతి - 1946 లో) సాక్షాత్కారము (పద్యకృతి - 1946 లో తులసీదాసు జీవితం ఆధారంగా) రాయల నీతి కథలు (వచనం - 1953,'55,'57 లలో 6,7,8 తరగతుల పిల్లలకోసం) పురోగమనము (వచన కవితలు - 1951 లో అభ్యుదయ భావాలతో) విజయతోరణము (పెద్ద కథలు - ఆంధ్రప్రదేశ్ పాఠ్య గ్రంధాల కమిటీ గుర్తింపునందిన రచన) ఇలా పుంఖానుపుంఖ రచనలతో పుట్టపర్తి సాహిత్యాకాశంలో అప్రతిమానంగా వెలిగిపోతున్నారు.

కానీ, ఏదో అసంతృప్తి!! రచనావ్యాసంగం నిరాఘాటంగా జరుగుతున్నా, ఆధ్యాత్మిక మార్గంలో ఎటువంటి ప్రగతినీ సాధించలేకపోయాననే తపన, వారిని హిమలయాలవైపుకు నడిపించింది. అది 1948 ప్రాంతం. చేతిలో పైసా లేకున్నా, ఆమూలాగ్రం కంఠస్థమైన తులసీ రామాయణం, వారిని ఉత్తరాది వాడిని చేసేసింది. అనర్గళంగా వారు పఠించే తులసీమానస కావ్య పఠనం పట్ల ఆకర్షితులైన ప్రజలంతా, వారిని తమ వాణ్ణి చేసుకుని, టికెట్టు కూడ కొనిస్తూ, వారికి ఆహారాన్ని కూడ సమకూరుస్తున్నా, ఒకనాడు వైరాగ్య భావనతో



చనిపోవాలని హృషీకేశ్ లో కొండ చివరన నిలబడి ఉండగా, స్వామి శివానంద సరస్వతి వారిని గమనించి, ఆత్మహత్యా ప్రయత్నం నుండీ, విరమింపజేసి, తమ ఆశ్రమానికి తీసుకు వెళ్ళారు. ఒక సంవత్సర కాలం పుట్టపర్తిని తమ వద్ద ఉంచుకుని, వారి బహుభాషా యోషను మెచ్చుకుని వారన్నారు..' ఇకపై నీవు సరస్వతీపుత్రుడవు. ఇంత పాండిత్యాన్ని వృథా చేయటం వివేకం కాదు. నీ కుటుంబ బాధ్యతలను పూర్తిగా నెరవేర్చు. నీకు సాహిత్యంలో బ్రహ్మాండమైన గుర్తింపు రానుంది. ఆధ్యాత్మికంగా కూడా ఎన్నో అనుభవాలు నీకోసం వేచి ఉన్నాయి. ఇప్పుడిక ఇంటికి వెళ్ళిపో!! ఇది నా ఆజ్ఞ!!"

పుట్టపర్తి సంవత్సర కాలమిలా అజ్ఞాతంలో ఉండి హృషీకేశ్ లో శివానంద సరస్వతీస్వాములవారి ఆజ్ఞతో, ప్రొద్దుటూరికి తిరిగి వచ్చేసరికి, అక్కడి ఉద్యోగం కాస్తా పరుల హస్తగతమైంది.ఈ సంవత్సర కాలం, పుట్టపర్తి శ్రీమతి, భర్త జాడ తెలియక, ఇద్దరు ఆడపిల్లలతో సంసారాన్ని ఎలా నెట్టుకు వచ్చారో పుట్టపర్తి నమ్మిన అ అష్టాక్షరీ నాధునికే ఎరుక!! (పెద్దమ్మాయి కరుణాదేవి పుట్టుక 18-12-1939, రెండవ కుమార్తె తరులతాదేవి పుట్టుక 11-9-1942, వీరిరువురి తరువాత ఒక మగ సంతానం పుట్టి, ఆరునెలల తరువాత గిట్టటం జరిగింది).

మళ్ళీ ఉద్యోగాన్వేషణలో పుట్టపర్తి 1952 సంవత్సరంలో కడప గడప తొక్కారు. మోచంపేటలో శ్రీ రామకృష్ణా హైయ్యర్ సెకండరీ పాఠశాల కరస్పాండెంట్ శ్రీ ఆర్.రంగనాథం గారు వారి కీర్తి ప్రతిష్టలనెరిగినవారు కావటంతో, అదే పాఠశాలలో, తెలుగు పండితులుగా పుట్టపర్తిని నియమించారు. కడపలోనూ గోస్వామి తులసీదాసు పుట్టపర్తిని వదల్లేదు. భక్తిమార్గంలో వారి పయనం కొనసాగుతుండగా, 1955 లో ఒక చిత్రం జరిగింది.

మళయాళ భాషా నిఘంటు నిర్మాణ సంఘాధ్యక్షులైన ఆచార్య సూరనాడ్ కుంజన్ పిళ్ళై గారు పదచరిత్ర నిఘంటువు (ఎటిమలాజికల్ డిక్షనరీ) నిర్మాణానికి, దక్షిణాది భాషలలో ప్రావీణ్యత, దక్షిణ భారత భాషల్లో ప్రసిద్ధిగాంచిన పండిత కవుల గురించి మదరాసు విశ్వవిద్యాలయాన్ని విచారించగా, వారు పుట్టపర్తి పేరును ఏకగ్రీవంగా సూచించారట!! అలా చిత్రంగా, తిరువాన్ కూరు విశ్వవిద్యాలయం వారు పుట్టపర్తిని అభ్యర్థించి, దరఖాస్తు అడిగి మరీ పెట్టించుకుని, పుట్టపర్తికి ఎం.యే. పరీక్షనుండి మినహాయింపునిచ్చి, నిఘంటు నిర్మాణ కార్యాన్ని అప్పగించారు. తెలుగు, కన్నడమూ, తమిళమూ, హిందీ, సంస్కృతము, ప్రాకృత భాషల్లో అపార పాండితి గల పుట్టపర్తి వ్యాసాలెన్నో అప్పటికే భారతి ఇత్యాది

పత్రికలలో ప్రచురితమయ్యాయి మరి!! ఇంకేముంది? పుట్టపర్తి తిరువాన్ కూరు విశ్వవిద్యాలయ ఉద్యోగిగా కేరళ రాష్ట్రంలో అడుగు పెట్టారు.

అక్కడో వైపు పదకోశ నిర్మాణంలో తనవంతు కృషి చేస్తూనే, మరోవైపు, మళయాళభాషాసాహిత్యాలతో సాన్నిహిత్యం పెంచుకుంటూ, కథకళి సాహిత్యం, స్వాతి తిరుణాళ్ సంస్కృత కృతులు, చంద్రోత్సవము –కేరళ మణిప్రవాళ కావ్యము వంటి పరిశోధనాత్మక వ్యాసాలు వ్రాశారాయన!! భారతి, పరిశోధన వంటి ప్రతిష్ఠాత్మక పత్రికల్లో అవి ప్రచురితమయ్యాయి కూడా!!

అప్పుడు అక్కడ కేరళ గవర్నర్ గా తెలుగు రాజకీయ దురంధరుడు, డా.బూర్గుల రామకృష్ణారావు గారు ఉండటం పుట్టపర్తికి కలిసి వచ్చింది కూడా!! వారితో అప్పుడప్పుడు భేటీ అవుతూ ఉండేవారు కూడా!! ఇరువురి మధ్యా సాహిత్య చర్చలూ ముచ్చటలూ తరచూ జరుగుతుండేవి. అంతే కాదు, విశ్వనాథ సత్యనారాయణ గారి ఏకవీర నవలను, బూర్గుల రామకృష్ణారావు గారి కోరిక మేరకు మళయాళంలోకి సాధికరంగా అనువదించగా, దాన్ని అప్పటి ఇంటర్మీడియెట్‌కు పాఠ్యగ్రంధంగా కూడా ఎంపిక చేశారు. ఇదీ పుట్టపర్తి సామర్థ్యం!!

ఈ మధ్య కాలంలోనే మరాఠీ నుండీ, ధర్మానంద కోశాంబి రచించిన బుద్ధ చరిత్రను, బుద్ధభగవానుడు గా కేంద్ర సాహిత్య అకాడమీ కోసం (1957) , కన్నడ నవలాకారుడు బీచి రచించిన సరస్వతీసంహార నవలను సరస్వతీసంహారంగానూ (1957) , మళయాళ నాటక రచయితలు పీ.జే.థామస్, పీ.సీ.కుట్టికృష్ణన్, తిక్కొడియన్, చెరుకాడ్, ఇదశ్శేరి గోవింద నాయర్, డీ.యన్.యన్. కృష్ణపిళ్ళై, మలయాట్టూర్ రామకృష్ణన్ రచిత నాటికలను తెలుగులోకి (1959) అనువదించారు.

అక్కడినుండే, దక్షిణాది భాషా సాహిత్యాలకు ప్రతినిధిగా 1955 లో నైనిటాల్ లో జరిగిన 'సాహిత్య శిబిర్' కు ఆహ్వానితునిగా,సుప్రసిద్ధ కవయిత్రి శ్రీమతి మహాదేవీవర్మ ఆహ్వానం మేరకు వెళ్ళి, అక్కడ తన శివతాండవ గానంతో దినకర్, మైథిలీశరణ్ గుప్త్ వంటి ఉద్దండ విద్వాంసులనందరినీ ఆకట్టుకున్నారు.

కానీ, తిరువాన్‌కూరు కార్యాలయ సిబ్బంది వ్యవహారాలు, పరిస్థితులు అనుకూలించక, ప్రొద్దుటూరికి వెనుకకు మరలే ఆలోచనలో ఉన్న పుట్టపర్తికి ఢిల్లీ సాహిత్య అకాడెమీ పిలుపందింది. అక్కడి బహుభాషా గ్రంధాలయానికొక ఉద్యోగి అవసరమైంది. పుట్టపర్తిని, తిరువాన్ కూరు ఉన్నతాధికారి ఆచార్య సూరనాడ్ కుంజన్ పిళ్ళైగారు, 'మీ పాండిత్యాన్ని తెలుగువారు తెలుసుకోలేకపోయారు, కానీ మేము మిమ్ము ఒక మళయాళీ విద్వాంసునిగా గౌరవిస్తున్నాము. మిమ్ము ఢిల్లీకి సగౌరవంగా పంపుతున్నాము, మా ఉద్యోగిగా!!' అని వీడ్కోలు సభలో పలికారంటే, పుట్టపర్తి విద్వత్తు వారినెంత ప్రభావితం చేసిందో అవగతమౌతుంది.

1958 లో అలా ఢిల్లీ వాసం మొదలైంది పుట్టపర్తి కి!! సాహిత్య అకాడమీకి విచ్చేసే దినకర్, సుమిత్రానందన్ పంత్, మహాదేవీ వర్మా లతో ఇదివరకే నైనిటాల్ లో పరిచయం జరిగింది కూడా!! గ్రంధాలయంలో కూర్చుని గ్రీక్, లాటిన్, ఫ్రెంచ్, రష్యన్ భాషలతోనూ పరిచయం చేసుకున్నారు. అవధీ, మాగధీ, అర్ధమాగధీ మొదలైన ప్రాకృత భాషాసాహిత్యాలనూ ఒక పట్టు పట్టారు.

భారత ఉపాధ్యక్ష పదవిలో రాణిస్తున్న తెలుగు తేజం డా.సర్వేపల్లి రాధాకృష్ణన్ గారితో చక్కటి పరిచయం ఏర్పడిందక్కడే!! దారిలో తాను నడిచి వెళ్తుంటే, కారాపి తనను యెక్కించుకునేవారనీ,అప్పుడప్పుడు ఇంటికి పిలిపించుకుని సాహిత్య చర్చలు చేసేవారనీ పుట్టపర్తి అనేక ముఖాముఖి కార్యక్రమాలలో చెప్పారు. అలాగే, లోక్ సభ స్పీకర్ గా ఉన్న మాడభూషి అనంతశయనం అయ్యంగార్ గారితోనూ తో సాన్నిహిత్యం కూడ అక్కడే ఏర్పడిందట!! కబీరువచనావళి అన్న గ్రంధాన్ని, కేంద్ర సాహిత్య అకాడెమీ కోసం అనువదించారు అక్కడున్నప్పుడే!!

కానీ, తన ఇంతితో, ఇంటితో దూరమొకవైపు, 1960లలో అంటుకున్న కామెర్ల బాధొక వైపూ బాధిస్తుంటే, ఇక మళ్ళీ, కడపకు మరలక తప్పలేదు పుట్టపర్తికి, స్థిర నివాసమేర్పరచుకునేందుకు!! తిరిగి కడపకు చేరుకుని రామకృష్ణా హైస్కూల్లో తెలుగు పండితునిగాచేరి, అక్కడే ఉద్యోగవిరమణ కూడా చేశారు. (1974) కావలి కళాశాలలో సంస్కృతాచార్యుని పదవి వరించినా 'తన స్వతంత్రభావ జీవనానికి అడ్డొస్తుంద'నే వెళ్లలేదు. "నేనే పండితుణ్ణి", 'నేనూ పండితుణ్ణి' అన్న నిశ్చితాభిప్రాయం వుండేది. కానీ నాకు తారసిల్లిన నేను దర్శించిన స్వామీ శివానంద, అరవిందులు, కంచిపరమాచార్యులు, రాళ్లపల్లి, సూరనాథ్ కుంజన్ పిళై, పటేల్ వంటి ఎంతమందివల్లో 'నేను పండితుణ్ణేకాద'నే భావం నెలకొంది. "వినయమే వ్యక్తికి సదా భూషణం" అనేవారు పుట్టపర్తి 1990, సెప్టెంబర్ 1 ప్రభాతవేళ కీర్తికాయులయ్యేవరకూ!

## కవిగా పుట్టపర్తి

పుట్టపర్తివారి మొట్టమొదటి కావ్యం – 'పెనుగొండలక్ష్మి'. 12వ సం॥ వయసులో వ్రాసిన యీ కావ్యం తదనంతరం వారికే విద్వత్ పట్ట పరీక్షకు పాఠ్యగ్రంథం. దీనినిబట్టే ఆ కావ్యంలోని ప్రౌఢతను వాఙ్మయవేత్తలు ఊహించుకొనవచ్చు.

'ముదల'తో మొదలయ్యే యీ కావ్యంలోని మొట్టమొదటి పద్యం యిది.

"ఏమో! యీ వికటంపు రూపకము లిందే యర్థముత్పన్నమై
ప్రేమాధీశ్వరు నిండు కన్నులకు దృప్తిన్ గూర్చునో, హేతువే
మో! మా యాత్మలకందరాదు, వెడయూర్పుల్జిమ్మి నిర్వేద, ధా
రా మాంద్యంబున మోకరించు మతి యెల్లన్ యోచనా సంగతిన్"

ఈ ప్రపంచమంతా వికృతమైన నాటకమనీ, దీనివల్ల ఆ భగవంతునికి ఒనగూడే ప్రయోజనమేమిటో, ఆ ప్రేమాధీశ్వరుని నిండు కన్నులకు, యీ వికటంపు నాటకము యేవిధంగా తృప్తి యిస్తుందోనన్న ఆలోచన అంత చిన్న వయసులోనే, బాలనారాయణుడు చేయగల్గటం ఆశ్చర్యం.

అటు తరువాతి ఖండికలలో 'పుట్టపర్తి'లోని ఆంధ్రదేశాభిమానం – వరద పరవళ్లతో ముందుకుసాగే గోదావరిని తలపిస్తుంది.

సీ. తెలుగు రాయని పల్కు పొలతికి దానిమ్మ
రసములో నుగ్గుపాల్గలిపి పోసి
ముసలి ముప్పున మీసమును దువ్వు మా రామ
నృపతి, గుండెలకును నీరు దట్టి
తిరుమలరాయ పృథ్వీశులేనవ్వు వె
న్నలలోన, గరువంపు మొలకవోసి
రామభూషణ కవిరాజు కోకిలచేత
బలికించు, హిందోళగలయ బలికి

గీ॥ అరణ కవి సృష్టి యా గొల్లయందగాని
కూకటులలోన, నెఱికొండగోగుజెక్కి
అలసి సొలసిన, మా యింటియాడుబిడ్డ
ఘనగిరి నివాసినీ! నమస్కారమమ్మ!



ఈ 'పెనుగొండ'ను 'ఘనగిరి'గా స్తుతించి, తన జన్మస్థలానికి ప్రణతులర్పించిన పుట్టపర్తి కలం నుండి తరువాత, "రాయల పాదముద్రలు తలదాల్చి సొంపులు దిద్దుకొన్నట్టి కలిమికన్న", "ఉలిచే తేనెల సోనలన్ చిలికి", "ఎట్లు పైకెత్తిరో యేన్గు గున్నలకైన" "మునుల తేజోబలంబున" వంటి చిక్కని పద్యాలు జాలువారి చదువరుల హృదయాలలో, భారతీయ మహోన్నత సంస్కృతి వైభవస్ఫూర్తిని నింపాయి.

కాల్పనికోద్యమ స్ఫూర్తితో వెలువడిన 'షాజీ' సూఫీమత సంప్రదాయ పరిమళ భరితం. జహంగీరు పాలనాకాలంలో 'సృష్టిసౌందర్యా'న్ని 'రమ్యకళార్చనం'గా భావించి గానం చేసిన యోగిపుంగవుడు షేక్ సాదీకవి. అతని జీవితఘట్ట స్ఫూర్తితో, అద్భుత ప్రణయావిష్కరణ జరిగిన యీ కావ్యాన్ని 'కాంపోజిట్ స్టేట్'లో ఎఫ్.ఏ.కు పాఠ్యగ్రంథంగా పెట్టటం జరిగింది.

ప్రకృతికో, మాయకోకాక భావనాప్రపంచ సౌదామినికొ, తపఃప్రభకొ శూన్య
మునకొ, యానందరూపమై మోదమొసగు సాత్వికవ్యక్తికీ నమస్కార శతము

ఆ ప్రకృతి ఉపాసకుని సందేశాన్ని ఆవిష్కరించినతీరు అద్భుతం. "తరళ మొకసారి తొలకరి మెరుపుకన్న– వేడి యొకసారి, చిచ్చుఅపిడుగుకన్న– భారమొకసారి, మేటి పర్వతముకన్న – నతి మహత్తరమీ ప్రణయానుభూతి" వంటి పద్యాలు విమల ప్రణయానికి కేతనాలంటారు డా. తిరుమల శ్రీనివాసాచార్యులవారు.

1937 ప్రాంతాలలో తొలి స్వాతంత్ర్యసమరంగా వినుతికెక్కిన 'సిపాయిల తిరుగుబాటు'ను 'సిపాయి పితూరీ'గా విరచించారు పుట్టపర్తివారు. తమ పందొమ్మిదవయేట తిరుపతిలో –శిరోమణి చదువుతున్నపుడు వ్రాసిన యీ కావ్యం, సహవిద్యార్థుల సాయంతో తొలిముద్రణకు నోచుకుందట!

సీ. "అక్కన్న మాదన్న లెక్కివచ్చిన దేరి ప్రాపుననతడు నవాబుగాడొ
తెలగనార్యునికైతబులకరించిన దేరి ప్రాపున నతడు నవాబుగాడొ
భద్రాద్రిరామ సేవకు ముత్తెములనిచ్చి పంపెడువాడు నవాబుగాడొ
ఆ జగన్నాథు ద్రాక్షాసవస్యంది భాషాబద్ధ బుద్ధి నవాబుగాడొ"

ముస్లిములు, హిందువులన్న భేదభావాలను మనలో రగులుకొల్పి, విభజించి పాలిస్తున్న ఆంగ్లరాజ్యాధిపత్యాన్ని సమర్థవంతంగా ఎదుర్కొని, జాతీయతా భావానికి ప్రేరణనిచ్చిన వైనం గురించి 1957 జూలైనాటి 'భారతి'లో కావ్య సమీక్షకులు సింగు – "ఈ కావ్యరచనా

కాలాన్ని బట్టి పూవు పొలుపు పూవుది. మొగ్గ మురువు మొగ్గది. రచయితలో కాలక్రమేణ, మూడు పూవులారు కాయలై వెలసిన కవితా కౌశలానికి బీజాలు, యీ ఖండకావ్యమంతా పుష్కలంగా దొరుకుతున్నవి" అన్నారు.

1945లో ముద్రింపబడిన 'పాద్యము' – ముప్ఫై సంవత్సరాల పుట్టపర్తి రచన. 'పాద్యము వేదనాశతకము, విభూతి శతకము'గా ముప్పేటల విరచించబడిన యీ కావ్యంలోని ప్రతిపద్యమూ 'భౌతిక మాలిన్యమంటని రసానంద గుళిక' అంటారు తిరుమలరామచంద్రగారు. 1972లో ద్వితీయముద్రణ నందిన యీ కావ్యంలో "నా కవిత్వము మంచి పాకమున పడినద"ంటారు– పుట్టపర్తివారే! శతకపద్యాల్లో మకుటం నియతంగా లేకపోయినా, దానవీరం, దయావీరం, కర్మవీరం వంటి వానిలో 'భక్తివీరం' కూడా కవి చేర్చినవైనం బహుధా ప్రశసంనీయం.

'సాక్షాత్కారము' తులసీదాస్ జీవితం స్ఫూర్తిగా విరచించబడింది. 1955 నాటికి ద్వితీయముద్రణ కూడా వచ్చిందంటే, దానిలో పుట్టపర్తి కవితాపటిమ ఎలా ఎంతవరకు పండిందో, సులభంగానే వూహించుకొనవచ్చును.

తులసీ! నీ చల్లని రూ
పుల మా రఘునాయకుండు పొంగారెడునే
వలపుల చల్లితివమ్మా!
చెలియా! నేమంబు బోధసేయగరాదో!

వంటి లలితసుందర భక్తి సుమహారం యీ సాక్షాత్కారం.

శివపార్వతుల తాండవలాస్యావిష్కరణం 'శివతాండవమ్'. సంగీత సాహిత్య నృత్యకళా త్రివేణిగా యీ రచన పుట్టపర్తివారి కీర్తికిరీటంలో కలికి తురాయివంటిది. "జలదగంభీరమైన వారిగానంలోనే యీ శివతాండవాన్ని ఆస్వాదించటం గొప్ప అదృష్టంగా భావించేవారానాటి పుట్టపర్తి అభిమానులు! ఈనాడు "ఉచ్ఛ్వాసబంధన గానం" (బ్రీత్లెస్)గా పేరొందిన ప్రక్రియ. ఆనాడే పుట్టపర్తి, తన శివతాండవ పఠనంద్వారా ఆవిష్కరించటమేకాక, శ్రోతలలో ఓ వర్ణనాతీత ఉద్వేగాన్ని నింపేవారని కూడా ఉవాచ.

"ఏమానందము భూమీతలమున
*శివతాండవమట! శివలాస్యంబట!"*



ప్రకృతి శివతాండవావలోకనానికి సంసిద్ధమైన తరువాత శివతాండవాన్ని వర్ణించినతీరు అనితరసాధ్యమని వేనోళ్లకొనియాడబడుతున్న పుట్టపర్తివారు యీ కావ్యపఠనంలో తన నర్తనాన్ని కూడా జోడించి అత్యద్భుతంగా ప్రదర్శించేవారట! అద్భుత పదప్రయోగం, నాదసౌందర్యం, భావవిన్యాసం – పతాక స్థాయికి చేరుకున్న రచన యిది. అహమహమికగా పరువులెత్తే పదచిత్రాలతో, కర్ణ రసాయనంగా భాసిల్లే యీ రచన పుట్టపర్తి సరస్వతీపుత్రత్వానికి అచ్చమైన దర్పణం.

శివునికి అనంతలయుడు, ఆదిభిక్షువు,ఇందుమౌళి, జీవనుడు, ఈశానుడు, కపర్ది, కేదారుడు,జ్వాలి, చంద్రధరుడు, జటాధారి, త్రినేత్రుడు, త్రిలోచనుడు, ఫాలనేత్రుడు, బాలేందుమౌళి, మిహిరాణుడు, మేరుధాముడు,సారంగుడు, సూర్యుడు, నటేశ్వరుడు, పంచాననుడు ఇలా అనేకానేక సంబోధనలున్నాయి. కానీ అన్నింటిలోకి, నటరాజు అన్నది అతి మహత్తరమైనది. సృష్టి స్థితి లయకారుడాయన!! నాట్యం ఆయన ఆకారం. నాట్యం – ఆయన వ్యక్తిత్వం. నాట్యమే ఆయన అభివ్యక్తి. జగతిని తన కనుసన్నలలో నర్తింపజేసే నటరాజు ఆయన. కాబట్టే, యీ బ్రహ్మాండం ఆయన రంగస్థలం. ఆయనే నటుడూ, అయనే ప్రేక్షకుడూ కూడా!!

ప్రొద్దుటూరు వాసం సమయంలో ఒక మండల దీక్ష సమయాన, పుట్టపర్తిలో పెల్లుబికిన రసావేశఝరి శివతాండవంగా ఆవిష్కృతమైంది. మాత్రాఛందస్సులో, గేయకవితారూపంలో దేశిఛందోరీతుల పతాక స్థాయి అభివ్యక్తి తో ఖండగతిలో అక్షరీకరించబడిందీ కావ్యం!! ప్రౌఢ గంభీర రసావేశమో వైపు. నాట్య, సంగీత రహస్య సమ్మేళనమో వైపు!! బాల్యంలో పెనుగొండలో పక్కా హనుమంతాచారి గారి వద్ద, నేర్చిన శాస్త్రీయ సంగీత ప్రభావంతో అమరిన గౌళగాత్రాలాపనకు, రంజకం మహాలక్షుమ్మ వద్ద నేర్చిన నాట్య కళాభినివేశం తోడై, యీ రచన మొదలైన తొలినాళ్ళలో, పుట్టపర్తి తనదైన నాట్యాభినివేశంతో పాటూ, వేదికలపై ప్రదర్శించేవారు కూడా!! ఆ ప్రదర్శన చూడటమే ఒక మహద్భాగ్యంగా వారి సాహిత్యాభిమానులు భావించేవారట!! తాము చూచిన ఆ అనుభవాన్ని ఉద్వేగంగా పంచుకునేవారు, కొంతమంది నిన్నటితరం వాళ్ళు!! శివతాండవం ప్రచురితమై, పుట్టపర్తి పుంభావసరస్వతిగా ప్రపంచవ్యాప్త కీర్తినందిన తరువాతకూడా, ఎక్కడికి వెళ్ళినా, శివతాండవ గానం తప్పనిసరిగా ఉండితీరవలసిందే!! ఆ తరువాత, వృద్ధాప్య దశలో కూడా, శివతాండవ గానం వారినుండి ఆశించేవారంటే అతిశయోక్తి ఏ మాత్రం కాదు.

అభిద, లక్షణ, వ్యంజన, అలంకారాలూ – ఇవన్నీ కావ్య వైశిష్ట్యానికి వన్నెలు చేకూర్చేవి. శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ, ఉభయాలంకారాలూ అన్న మూడు విధాల అలంకారాలను తన పదునైన భావావేశంతో పలు విధాల పాఠకులపైకి సంధిస్తారు పుట్టపర్తి యీ కావ్యంలో!! ఆచార్యులవారి వస్తు, శబ్ద, భావ వైచిత్రి జలధిలో పఠితలు, శివానంద లోకాల అంచులవరకూ ప్రయాణించి, అద్వితీయానుభూతిని పొందుతారనటం సత్యం.

గతంలో ఒకనాడు,పుట్టపర్తిని 'ఇప్పటివరకూ ఏవైనా వ్రాశావా??' అని ప్రశ్నించి, వెనువెంటనే వారి ఆశు పద్యాలను విని ఆశ్చర్యచకితులైన శ్రీపాద గోపాల కృష్ణ మూర్తిగారు, 'శివతాండవ కావ్యగుణములు 'అన్న తమ అభిప్రాయంలో (1961 ప్రచురణ) లో, 'నారాయణాచార్యులవారు విజయనగరాస్థాన విద్వద్వరేణ్యులు తాతాచార్యులవారి వంశములోని వారు. విజయనగర సారస్వత విభూతి వీరి రచనలో మెరుస్తూ ఇంపు గొలుపుతుంది. ఆంధ్ర వాఙ్మయానికి అభిశాపరూపమైన చంపూ పద్ధతిని వీడి, ఆయన, తెలుగు జిగిని చక్కగా వెలయించగల పదఛందస్సును స్వీకరించుట ఆయన చైతన్యమును ప్రకాశించు దీపము..' అన్నారు.

శివతాండవానికి ముందు 'ఏమానందము భూమీతలమున..' అంటూ పగడపు పులుగులవలె విరిసిన మబ్బులూ, జలదాంగనలై శివతాండవాన్ని విలోకించేందుకు వచ్చిన వియచ్చర కాంతాసందోహం, గుత్తులు గుత్తులుగా పూవుల నికరమ్ములను రాల్చుతున్న కొమ్మలు, శివతాండవంలో శ్రుతి పట్టేందుకు గొంతులు సవరించుకుంటున్న భృంగాలు, విచ్చలవిడిగా దుసికిళ్ళాడే కుచ్చెళ్ళతో విస విస వెళ్తున్న సెలకన్నియలతో ప్రకృతి పర్యుత్సుకత, మనసును శివతాండవ వీక్షణానికి సమాయత్తం చేస్తుంది.

దేవ భాషలో నంది నాంది. నెలవంక వెలుగులో విరిసిన జటలు, భూషణాలుగా అమరిన మూడవ కన్నూ, సర్పాలూ, కోటి కాంతులను విరజిమ్మే జటాజూటంతో వెలుగొందుతున్న ఆ మహాప్రళయ రచయిత, నృత్య భావంలో లీనమైన తన అర్ధాంగి పార్వతీదేవి, తన పాదలత్తుకలతో తనకు లలాట తిలకం దిద్దగానే, నాట్యానికి సమాయత్తమవటం, నంది జగన్నాయకునికి జయ జయ ధ్వానాలు పలకటాన్ని అతి మనోహరంగా వర్ణించారు పుట్టపర్తి.

తరువాత అసలైన తాండవవిన్యాసం ప్రారంభమౌతుందంటారు.' తలపైని జదలేట యలలు దాండవమాడ..' అటు శివుడు నాట్యాన్ని ప్రారంభిస్తే ఇక, ఇటు పఠితల హృదయ



తాండవమూ మొదలౌతుంది. నటరాజు నాట్య విన్యాసాల విన్నాణాల వర్ణనలో తలలు పండిన నేటి నాట్య కళాకారుల అభినయ పాటవానికందని ఎన్నో భంగిమలను ఆ విశ్వనాటక సూత్రధారి ఆ కైలాస శిఖర వేదికపై, పరవశాంతరంగంతో వీక్షిస్తున్న తన ఆరాధకుల ముందు ప్రదర్శించటం, పుట్టపర్తి తన మనోనేత్రం తో ఆ ప్రదర్శనను (సౌందర్యలహరిలో ఆదిశంకరులవలె) ప్రత్యక్షంగా వీక్షించి, వర్ణిస్తున్నారా అన్నట్టే అనిపిస్తుంది కాబట్టే, శివతాండవాన్ని ఆ విభూతి వరించింది.

నాట్యాభినివేశం తరువాత, పరమశివుని సంగీత సామర్థ్యాన్ని వర్ణించే క్రమంలో, మేళకర్త రాగాలు, వక్రరాగాలు, ప్రతిమధ్యమ రాగాల రహస్యాలు ఆ భక్తవశంకరుని గొంతులో పలికిన తీరు, స్వరకన్యకలు ఒడలు మరచి ఆయన గళాన ఒదిగిపోయిన తీరు, ఆ సంగీత ఉద్దండ ఝరికి తాళం వేస్తూ సహకరిస్తూ, పరవశులైపోతున్న దేవతలు కూడా, ఒక్కోసారి ఆ అద్భుత నటనాధురీణుని తాళగతులను అంచనావేయలేక, తికమక పడే తీరులను కళ్ళకు కట్టినట్టే వర్ణించారు పుట్టపర్తి.

అటుతరువాత, అగజాత చెలికత్తె విజయ రంగప్రవేశం చేస్తుంది. తమ దేవేరి పదకమలపాటలిమను ప్రాత:కాల కాంతిగా, మునులకు దిక్సూచిగా అభివర్ణిస్తూ, ఆ మాతంగి లాస్యవిన్యాసానికి తెరతీస్తుంది.

నిత్య రమణీయ లోకములు పొంగెత్తగా, దేవి గానిస్తున్నది.పలికినది వల్లకులో పరమేశ్వరోదెలియరానట్టుగనే, దేవి గానిస్తున్నది. నాట్యాంతర్గత నవశిరోభేదములు, అష్టగుణ భావ దృష్టులూ, పన్నెండు హస్తములూ, గ్రీవాభేదములతో పొదిగి గిరికన్నె నాట్యమాడుతున్నది. కొంతసేపు నేలపై నిలిచి (భూచారి నాట్యం) కొంతసేపు పైకి చెంగించి (ఖచారి నాట్యం) ఆమె చేసే లాస్య విన్యాసాలతో మైమరచిన తన భవుని వక్షముపై పదలాక్షను చిత్రించిందా గడసరి!

ఆమె లాస్యాన్ని మెచ్చి తరుణ చంద్రాభరణుడు మోదంతో చేతులు కలిపి ఆడనారంభించాడు. శివశక్తులొక్కటై నర్తిస్తుండగా, ఓంకారంతో కైలాసశిఖరాలు ప్రతిధ్వనిస్తుండగా, గీర్వాణులంతా వారిరువురికీ మంగళ గీతికలాలపించారట!!

శివతాండవ కావ్యం, పుట్టపర్తికి అఖండకీర్తిని సముపార్జించి పెట్టిందనటం యే మాత్రమూ అతిశయోక్తి కాదు. దీనిలోని సంస్కృత భాగం, శబ్దసమ్మేళనమూ, లయలకు మురిసి, భాష రాకున్నా నైనిటాల్ లో దీన్ని భారతీయ కవుల సమ్మేళనంలో పఠించినప్పుడు, మహదేవీవర్మ,

దినకర్, జానకీవల్లభశాస్త్రి మొదలైన కవివతంసులు మరి మరీ అడిగి వినిపించుకున్నారని, కృపలానీ, దేశ్‌ముఖ్ వంటి నాయకులూ ఢిల్లీలో చాలా ప్రశంసించారనీ స్వయంగా పుట్టపర్తే చెప్పారు. (1-6-1961 ముద్రణలో) దీని కాయము కాస్త చిన్నదైనందున పెంచి వ్రాద్దామని ప్రయతించినా కుదరలేదనీ, హిందీలోకి అనువదించి భారతం మొత్తానికీ అందిద్దామన్నా అందులోని భావ,అర్థ,శబ్ద సౌందర్యాన్ని అనువదించటం తనకే సాధ్యం కాలేదని కూడా వారన్నారు. హిందీలోకీ, జర్మన్ లోకీ, ఆంగ్లంలోకీ ఎవరో కాస్త అనువదించారనీ, కానీ అవంత సంతృప్తికరంగా లేని కారణమూ ఇదేననీ వారన్నారు. (1985 నవంబర్ ప్రచురణ)

'అగ్నివీణ' పుట్టపర్తి దంపతుల రచన. మొదటిభాగం పుట్టపర్తివారిది కాగా, రెండవభాగం- శ్రీమతి పుట్టపర్తిది. భావకవిత్వోద్యమ స్ఫూర్తీ, సూఫీతత్వ ప్రతిబింబమూ నిండి నిబిడీకృతమైన 'అగ్నివీణ'లో పీఠికాకర్త శ్రీ జమ్మలమడక మాధవరాయశర్మ గారికి, ఒక పండితరాయలు, ఒక వేదుల, ఒక నండూరి కనిపించగా, 'వఝుల రంగాచార్య'కు అగ్నివీణలోని ఖండికలలో కృష్ణశాస్త్రి, అబ్బూరి రామకృష్ణరావు గారలు దర్శనమిచ్చారు.

అగ్నివీణలోని ప్రథమార్థం తరుణ పుట్టపర్తి, పదునారు పదునెనిమిది సంవత్సరాల వయసులో సవరించిన రాగాలు. భారతి మొదలైన పత్రికలలో ప్రచురితమైనవి కూడా!! కాగా పుస్తకరూపంలో ప్రచురణ నాటికి లబ్ధప్రతిష్టులైనవారు, ఇప్పటి తన దృష్టికి నచ్చనివెన్నో అందులో ఉన్నా, ఒక్క అక్షరాన్నైనా మార్చలేదన్నారు పీఠికలో!!

ఇందులో అప్పటి సామాజిక విషయాలను స్పృశిస్తూ ఒక్కోసారి 'దిశాంచలములు రింగులువారేలా..' మరోసారి, 'మధురప్రేమమయ విశ్వమోహన గీతాన్ని లలిత లలితంగానూ.'ఇంకోసారి, సుఖదుఃఖాతీతానందానుభూతిలో వేదాంత భావాలతో ఆలపించింది పుట్టపర్తి మానస వీణ!!

పుట్టపర్తి కనకమ్మగారు కూడా ప్రాకృత,సంస్కృతాంధ్ర, తమిళ, మలయాళ, కన్నడ, హిందీ మొదలైన భాషల్లో మంచి పండితురాలు. వీరి పితామహులు గజారోహణ గౌరవాన్నందుకున్న సువిఖ్యాత కాశీ పండితులు శ్రీమాన్ ధన్నవాడ కిడాంబి రాఘువాచార్యులు. 'తర్క క్రోడ పత్రం', ధాతుకారికా:, అద్వైత పద సమర్థనం, అలంకారానుగమ:, వంటి శాస్త్ర విషయ గ్రంథాలతో పాటూ, శ్రీనివాస పాదుకార్పణ నాటకం, శ్రవణానంద నామక ప్రేక్షణీయం, సంస్కృతోత్కర్ష సంవాద:, మణివిద్రుమ హారము -కురుమూర్తి స్వామి విషయకము వంటి అనేక రూపక గ్రంథాలను విరచించారు. నిఖిలకవిజగజ్జేగీయమాన,



విద్వత్కవిమణి వారి బిరుదులు. 'అచట పుట్టిన.' వలెనే, కనకమ్మగారు కూడా, బాల్యంలోనే పితామహుల ఒళ్ళో కూర్చుని, సంస్కృతాంధ్ర పంచ కావ్య పఠనం చేశారట, పదునాలుగేళ్ళకే, పుట్టపర్తి వారి అర్థాంగిగా (28-2-1935) వారి ఇంట అడుగు పెట్టేనాటికి!!

అగ్నివీణ లోని మొదటి భాగంలో ఆమె రచనలిలా మనసునాకట్టుకుంటాయి. శ్రీరామచంద్రుడు, కనకమ్మ గారి ఆరాధ్య దైవం. పరమ తారక నామ ఆమె భక్తి కీర్తనలకు ముద్ర. వాల్మీకి రామాయణాన్ని అష్టోత్తర శతంగా సప్తాహ పారాయణాలు చేసిన ఆ తల్లి, కవిత్వంలో పతి పరిత్యక్త, సీతమ్మ వారి పక్షం వహించి, రాముల వారి ధర్మనిష్టనీవిధంగా ప్రశ్నించారు కూడా!!

ఉ. నీవాక ధర్మ నిష్టుడని, నీ చిర కీర్తి జగంబు పాడికో
బోవును భక్తి భావ పరి మూర్ఛితమై మరి ధర్మ నిష్టలో
ప్రోవులుగాగ, రాలిపడి పోయిన మామక దగ జీవితా
శావిల భస్మ రాసుల విచారములేరికి బట్టురా ప్రభూ!!

ఆమె దృష్టినాకర్షించిన యశోధర జీవితం, సిద్ధార్థుని ప్రశ్నించేలా పురికొల్పింది.

గీ. పడతుల ఎడంద త్యాగ దీపంబు వెలుగ
దంచు శంకించితో? సత్యమాడు నెడల
తరుణి త్యాగంబనెడు జిలుకు
నవ్వులందించి సాగనంపంగ లేనొ?

జీర్ణవిజయనగరము అన్న ఖండికలో కనకమ్మగారు, ప్రభ కోలుపోయి, జగజ్జేగీయమానంగా వెలిగిపోయిన విజయనగర ప్రాభవాన్ని గుర్తు చేసుకుంటూ, ఈ నాడు జీర్ణ శీర్ణంగా నిలచిన ఆ మహా సామ్రాజ్య శిధిలాలలో నిస్తేజంగా తిరుగాడుతున్న తెలుగు జాతిని ప్రశ్నిస్తున్నారిలా!!

సీ. ప్రతి భిత్తి నిలచి క్రమముగాగ శిల్ప క
న్యకలెల్ల చిరునవ్వు నవ్వినపుడు,
ప్రతి ఇంట వల్లకీ క్వణనంబు హేలావ
తీ గానముల లజ్జలోగినపుడు,
ప్రతి కోనలో సుధాభావముల్ వెదజల్లి
కవులు బంగరు కైత గట్టునపుడు,

ప్రతి నిముసము కృష్ణరాయ కృపాణ ధా
రేరమ్మదమ్ము నర్తించునపుడు

గీ. విట్ఠలేశునాలయపు నిర్వీర్య శిలలు,
గూడ స్వర కల్పనమ్ములు గూర్చినపుడు,
చూచియున్న భాగ్యంబింత నోచియున్న
యీ తెలుగు రక్తమిట్లు శుష్కింపదేమొ!!

దసరా కొలువులు జగజ్జేగీయమానంగా వెలుగొందిన చోట ముళ్ళ పొదలెలా మొలిచాయి? పారాణికాళ్ళతో రాణులు నడయాడిన చోట, కోడె త్రాచులు కొలువవడమేమిటి? కళలుడిగిన కోటగోడలపైన గుడ్ల గూబలు కూయటమేమిటి? పడతులు నృత్య విన్యాసాలు ప్రదర్శించిన పద్మ భవనములో (లోటస్ మహల్ – రాణి వాసము) లో దయ్యముల నర్తనమిప్పుడు!! పంపేశ్వరుని ఆలయములో శోకగీతికలు!! ప్రళయ రాక్షసి ఇనుప గజ్జెల రవము, తెలుగు నిట్టూర్పు, కలగలసి వినిపిస్తున్నాయని మరో సీసంలో ప్రశ్నల వర్షాన్ని కురిపించి,

చ. పుడమికి మ్రగ్గె నాంధ్రుల యపూర్వ కలారచనంబు కృష్ణ రా
యడొకడు, కావ్య జీవియయి, యర్ధ శవాకృతి దక్కినాడు, యీ
యడవుల డొంకలందు, ముసలవ్వను బోలిన తుంగభద్ర రా
పడెదు నెలుంగుతో బడుగు పాటల కుంటుచుబోవు నిప్పుడున్.

అపురూప వైభవానికి మరో చిరునామాగా నిలిచిన విజయ నగరంలో, ఇప్పుడు ముళ్ళచెట్లు, డొంకలూ నిలిచాయి. కావ్య సృష్టికర్త కృష్ణరాయుడు అర్ధశవాకృతి దాల్చిన యీ చోట, ముసలవ్వ వలె, తుంగభద్ర నది, బడుగు పాతలు బాడుకుంటూ, కుంటుతూ వెళ్తున్న దయనీయ దృశ్యాన్ని కళ్ళముందు నిలిపారు కనకమ్మ గారు.

మహాత్ముని 'హత్య' గురించి విన్న తీవ్రవేదన పుట్టపర్తి దంపతులలో తీవ్రశోకాన్ని రగిల్చింది. 'గాంధీజీ మహాప్రస్థానం'గా ఆవిష్కృతమైంది.

గాంధీజీని ఆనందపాంధునిగా, ప్రేమావతారునిగా, కరుణామధురానుభావునిగా 'గాంధి దేవుని'గా స్తుతించి కావ్యారంభం చేశారు.



*అవతారంబవుదో! విభూతివొ! సమగ్రానంద నిర్లిప్తుడొ*
*కవివో! బుద్ధి కనూహ్యమౌ జటిల తర్కగ్రంధివొ! కాక, క*
*ర్మ విలాసంబుల వృద్ధి జెందునొక సామాన్యుండవొ! యిద్దికా*
*దవు దంచేటికివాదు? నిక్కమగు తాతా! ఇంక రాబోవుగా!*

ఆ మహాత్ముని రక్తకణాలను 'త్రిభువనపావన గంగాజలములుగా, జినముని స్నపితాక్షరములు'గా 'కుపిత మహేశ్వర క్రోధజ్వాలలు'గా 'శరభరతోర్వి శాపజలమ్ములు'గా వర్ణిస్తూ 'భగభగమండే భారతాపయతో వేదికపై చిలికినవవిగో" అంటూ వాటిని ఏరుకోండి!, అని దుఃఖించారు పుట్టపర్తివారు.

కనకమ్మ గారు తమ పతిదేవునితో కలిసి ఆ మహితాత్మకు ఇలా అశ్రునివాళిని సమర్పించారు.

తే. ఎన్ని వెలుగులు భువి ప్రకాశింపనేమి?
అర్యముండొక్కడే నిక్కమైన వెలుగు,
యెందరు మనుష్యులిల ప్రభవింపనేమి?
ఆ మహాత్ముడొకడె సత్యమైన నరుడు..'

ఆ నిజమైన నరుని కూడా నిర్దయగా, కబళించిన మృత్యు దేవతను నిలదీశారు కవయిత్రి, నీ హృదయమింత రాయిలా ఐనదేమిటని?

తే. మృత్యు! ఒక్క పల్కు నాదాలకింపవమ్మ,
యతని విడుమమ్మ నీవొక్క ఆడుదాని
వా? హృదంతరమింత రాయైనదేమి?
నీకు దయ యెక్కడున్నదే, నియతి బిడ్డ?

సర్వమతసామరస్యాన్ని కవితాత్మకంగా చిత్రించిన తీరు అపూర్వం.

తే. తులసి రామాయణంబు పిచ్చిల రసంబు,
బైబిలు ఖురాను, దైవ సంభావ్య వాక్కు,
సదమలంబు గీతా జ్యోతి జ్ఞాన పరిధి,
యనుదినము, దేశమున పూజలందుగాక!

'యువ సాహిత్యగ్రంథమండలి' ప్రొద్దుటూరువారు, 1951లో ప్రచురించిన "పురోగమనము" అభ్యుదయ కవితాఖండికల సంపుటి. తమ 'తొలిపలుకు'లో "ఏ సిద్ధాంతానికీ

చెందినవాణ్ణికాదు. కాని, పౌరునిగా, మానవుడుగా శాంతిని కోరడానికి నాకు హక్కు వున్నది. దాన్ని వినియోగించుకోవద్దంటే 'మానవుడు'గా నేను బ్రదకడం మీకిష్టం లేదన్నమాట! అట్టి పైశాచిక ప్రయత్నాన్ని నేను అరికట్టుతాను" అంటూ తన గళంవిప్పారు. "నడవమ్మానడు, కవితా, నడునడు" అని కవితను ఆర్యులు, దస్యులు, యుద్ధం దారులనుండీ, వ్యాస, వాల్మీకి, బాణ, మయూర, భవభూతులవంటి అమరగాయకుల బాటను దాటి ఒక అగ్నిపర్వతం, ఒక ప్రళయ జంఝూ, నీ రచనలలో దులకింపగ నడువ"మని ప్రేరేపిస్తారు. రామానుజుడూ, సోమనాధుడూ, సూరదాసు, కబీరూ నీ కవితల దీవించగ' నడు ముందుకు అంటూనే –

*"పీడిత జనలోహ చరణ*
*తాడితులై చెట్లక్రింద*
*గుట్లగ్రింద గొర్రెలవలె*
*గొర్రెలవలె తము మఱచీ*
*గోడు పడేవారి గుఱిచి*
*నడవమ్మా! కవితా! నడునడు!"*

అని ఆర్తిగా పిలుస్తారు. "ధనికుల నిర్హృదయం, దారిద్ర్య ప్రళయనాట్యం, కన్నీరే నీకలమై, కలలే నీ భాషై, కడగండ్లే నీ కవితై, నడవమ్మా!" అని ఆక్రోశిస్తారు. ఈనాటికీ యెందరో 'అభయ'లు అసిఫాలు (కశ్మీర్) పైశాచిక కామతృష్ణకు బలవుతున్నారు. ఎందరెన్ని విధాల నిరసన ప్రకటించినా, సిగ్గూ, ఎగ్గూలేని 'పశువాంఛ', తనరీతిలో, తనదారిలో ఆగకుండా 'కుతి'ని తీర్చుకుంటూనే వుంది. ఆనాడే "పుట్టపర్తి' యీ అధమరతిని అసహ్యించుకుంటూ–

ఏదేశమైతేనేం,
యేమతమైతేనేం
మీ రాజకీయాలు మాడిపోనూ,
మీ విజ్ఞానం మానవత్వానికే సిగ్గు
*Raping Raping*
స్త్రీ పవిత్ర వస్తువు
స్త్రీ పురుషుని గర్వం
జగతికి గులాబితోట
స్త్రీ పైననా మీ మోసం!

అని తన 'గరళకంఠాన్ని' – శంఖంలా పూరించారు!



తనవంటి మానవుల దైన్యమే సుఖశయ్య
గా, వారి నిట్టూర్పు గాడుపులు చామరలు
గా, వీరికన్నీటగరగు, దినముల పైని
నిలిచి, 'మేమూ మానవుల'మంచు గొంతెత్తి
యార్చు ధనికుల జూచి యసురనియన్నాడు– వాడు మానవుడూ!

పుట్టపర్తివారి అభ్యుదయకాంక్షకు అద్దంపట్టిన మరో అద్భుతసృష్టి 'మేఘదూతం' లోని పైవాక్యాలు యీ కావ్యోద్దేశాన్ని స్పష్టంచేస్తున్నాయి. ధనిక వాదాన్ని నిరసించి నందుకు, నిర్బంధితుడైన ఒక సామాన్య దీనయువకుడు– తన భార్యకు మేఘునితో పంపిన సందేశం– యీ కావ్యకథాంశం. ఆంధ్రదేశ చారిత్రక సన్నివేశాల ప్రదర్శనంతో పాటు, పీడితతాడిత ప్రజల కన్నీటి చారికల చరితలనూ, ఖండగతిలో అఖండంగా ఆవిష్కరించారు వారు.

*"నిండుటాకలి దూయ*
*మండుటెండలుగాయ*
*నడపీనుగలవోలె నిలిచీ, శిరసుపై*
*గడు ధూళియును దుమ్ముబెరసీ, కనపడెదు*
*హరిజనులపై సుంత యాదరము నీవైన*
*బరపరా! వారి నోదార్చువారే లేరు"*

ధనిక వాదం పట్ల తన అసంతృప్తిని, ఆక్రోశాన్ని, మేఘదూతము రచన ద్వారా వారు వెలువరించి, సఫలతనొందారనటానికి నిదర్శనం – 1960 లలో తొలి ముద్రణనంది, మరెన్నోసార్లు మలి ముద్రణ భాగ్యానికి నోచుకోవటమే నంటారు వారి ఆరాధకులు!! మేఘ సందేశము (కాళిదాసు) హంస సందేశం (వేదాంతదేశికులు) పదాంక దూతము (కృష్ణానంద సార్వభౌమ) కోకిల సందేశము (ఉద్దండ) వాయుదూతము (దేవీచంద్రుడు) తులసీదూతము (మల్లినాథసూరి) వంటి ప్రతిష్ఠాత్మక రచనల వరుసలో, పుట్టపర్తి 'మేఘ దూతము ' పరిగణించదగ్గ వస్తువైవిధ్యమూ, వర్ణనా కౌశలమూ గల్గిన గేయ కావ్యము.

కాళిదాసు ఖైదీ, భార్యా విరహితుడు. ఋతు రామణీయకతను, జంటగా అనుభవించలేకపోవటమే అతని బాధ. పుట్టపర్తి ఖైదీ ధనిక వర్గ పీడితుడు. అకారణంగా జైలు శిక్ష అనుభవిస్తున్న దౌర్భాగ్యమతనిది!! గర్భవతి తన భార్యకు, మేఘుని ద్వారా సందేశమంపే క్రమంలో గగన తలాన మేఘునికి కానవచ్చే అనేకానేక ప్రాంతాల భౌగోళిక,

చారిత్రక, పౌరాణిక, సామాజికాంశాలను కూడ తేటతెల్లం చేస్తూ, తన తెలుగు నాటి గత ఘన కీర్తినీ, నేటి దుస్థితినీ  కూడా కళ్ళకు కట్టినట్టు వివరిస్తారు. అచ్చ తెలుగు పదాల సొంపునూ, పలుకుబడుల ఊపునూ జోడిస్తూ, పల్లె పట్టుల అందాలను అవిష్కరించారు వారు.

ఇందులో పుట్టపర్తి దృష్టిని దాటి పోయిన అంశం లేదనే అంటారు విమర్శకులు. జానపద కళాకారులు, లంబాడీలు, అడవి గొల్లలు, గొల్ల సుద్దుల వాళ్ళు, బుడబుడక్కలవారు, గంగిరెద్దులవారి విద్దెలను పోషించే నాథుడు కరవైపోయాడు. 'ఇంటింటిలో గూడ ఇంగ్లీషు చిలకలై, నేడు మా చదువులే నేలపాలైపోయె..'నని నిట్టూరుస్తారు. నాడు ఎన్నెన్నో ఊరి సమస్యలను తీర్చివేసి, న్యాయాన్ని నిలబెట్టిన రచ్చబండలు (పంచాయతులు) నేడు కేవలం పులిజీతం, పేకాట వంటి ఆటల కేంద్రాలయ్యాయి..అని 'పాత రోజులలో నిజాయితీని పొగడుతారు. ధర్మకర్తలు, గుడిమాన్యాలను దోచుకుంటుంటే, ఇక 'దేవునికి పలుకు బలమే లేదు..' అని బాధపడతారు. కానీ అదే గుడులలో 'ఒక్క ప్రాణము లేదన్న మాటే గానీ, మనిషికుండవలసిన అన్ని అందాలూ ఉన్న శిల్పాలు ఎన్నెన్నో ఉన్నాయి. వాటిని ఓ రసమూర్తీ!! చూడకుండా అడుగు ముందుకు వేయకు సుమా..' అని హెచ్చరిస్తారు.

ఇలా సాగుతూ, చారిత్రికాంశాలతోనూ, పౌరాణికాంశాలతోనూ రచనకు ఎన్నెన్నో మెరుగులు పెట్టి,  చివరికి, అతగాని ఇల్లాలిని కూడా పరిచయం చేయిస్తారా ఖైదీ తో!! ఆమె శ్యామాంగి, మధురాక్షి, చక్కనగు తీరులది, ఉత్ప్రేక్ష్య ఏమీ ఇందులో లేదు,ఏనాడూ తన( భర్త ) మాటకు ఎదురాడనేలేదు,తన విరహంలో ఆమె కూడా (రామ విరహంలో సీత వలె) ఏకవేణి గా ఉంటుంది..'అని జాలిగా తలపోసుకుంటూ, ఓ చెలికాడా! నీ భర్తను చూసివచ్చానులే..వేగమే తిరిగి వస్తాడులులే!!' అంటాడు. 'తనకు నా ముద్దులిచ్చానను. తన ప్రేమే నా జీవితం..' అను. కాస్త త్వరగా వెళ్ళు సుమా!! వేయి కన్నులతో నీ రాకకై ఎదురు చూస్తుంటుంది కళ్ళలో ప్రాణాలు పెట్టుకుని!!  తనకు ప్రాణ భిక్ష పెట్టిన ఫలము నీకు దక్కుతుందిలే!! హనుమ ఆ నాడు శ్రీరాముని విరహ బాధను సీతాదేవికి తెల్పినాడు. నెనరు గల్గిన దూతగా నీవీనాడు నా బాధను నా అర్ధాంగికి తీసుకెళ్తున్నావు..' అని మేఘాన్ని కీర్తిస్తాడా ఖైదీ!!

దళితజీవన వేదనలను మేఘునికి విన్నవించి, రాళ్లుమోస్తున్నవారి కడుపుకోతను అవధరించమని ప్రార్థించి, కంకర కొట్టేవారి పిల్లడు డొక్కలెగిరి పడుతుండగా ఏడుస్తున్న దృశ్యాన్ని అవలోకించమని వేడుతారు వారు. సందర్భోచితంగా, ఒకింత శృంగారాన్నీ, సౌందర్యాభివ్యక్తినీ, సామాన్యుల సహజీవన మాధుర్యాన్నీ సైతం, వ్యక్తీకరించినా, మేఘదూత కావ్యధ్యేయం– సామాన్య మానవ హృదయావిష్కరణే!

జాతీయస్ఫూర్తితోనే కాంగ్రెస్ చరిత్ర జానపద శైలిలోనూ 'అస్తసామ్రాజ్యం' (పద్యకావ్యం–విజయనగరపతనం) చేపట్టినా, కలుషిత కాంగ్రెస్ రాజకీయాలకు మదిరోసి మొదటి రచననూ, హిందూ ముస్లిమ్ గలభాలు యిష్టంలేక రెండవ రచననూ తానే చించివేశానని పుట్టపర్తివారే ఒక సందర్భంలో అన్నారు. (ఉదయం – 22-11-1988)

"ప్రాజ్యములైన సంపదలు పర్వులువెట్టినచోటు, లోక సం
పూజ్యములైన ధర్మరణముల్ చెలరేగిన గడ్డ సాహితీ
రాజ్యములేలుకొన్న కవిరాజులు, మెట్టిన భూమి, అస్త సా
మ్రాజ్యము దానికై కనులరాల్తు నఖంపచ భాష్ప పూరముల్

కాయము, కాయమానమున కమ్మని కీర్తికరాతిమాలికా
క్షాయిక రక్తముల్ గడిగి, చీకటి చిట్లిన తళ్ళికోటలో
దాయలగెల్చి, భాగ్యముల ద్రావగబూని, అభాగ్య దష్టుడై
పోయిన, రామరాజు మనపూర్వుడు, కోష్టములా కథాంశముల్"

ఇలాంటి చారిత్రక సత్యాలతో రెండువేల వరకూ విస్తరించిన 'అస్తసామ్రాజ్యం' ముద్రణకు నోచుకోకపోవటం మన దురదృష్టమేకదా!

"వ్రాసిన ముప్పదియేళ్లకు 'పండరీభాగవత ద్విపద రచన' మొదటి ముద్రణకు నోచుకున్నదట! (1975) 'ఇరువది వేలకు పైచిలుకు ద్విపదలను వ్రాసియున్నాను. కాని వీనిని గడ్డకు దెచ్చుమార్గము? నా నిరాశ యెక్కువైనది. వ్రాతప్రతి యందపేక్ష బెరిగెను. ఆ ద్విపదలలో గొన్నిటిని చెదలు తిన్నవి. కొన్ని నీటిలో దడిసినవి. ఇప్పుడు ప్రచురించిన ద్విపదలు యీ ప్రమాదములకు దప్పి నిలిచినవి. కొందరీ రచనలను 'ద్విపదల'ని చప్పరించిరి. వారికి నేనేమి బదులిత్తును? ఛందఃపద్ధతిని జూచి, రచనలపై రాగద్వేషములను పెంచుకొనువాడు రసికబ్రువుడు. అంతే!" పుట్టపర్తివారే 'పండరీ భాగవత' పీఠికలో యీ మాటలన్నారు. కానీ ఈ కావ్యం గురించి విశ్వనాథ వారేమన్నారు? "వ్రాసిన ఐదుకథలు బంగారమువంటి కథలు, కథలో ప్రాణమున్నచో కవి యల్పశక్తిమంతుడైనను భాసించును. అధిక శక్తిమంతుడైనచో చెప్పవలసినదేమి? ఈయన యధిక శక్తిమంతుడనుటకు, తెలుగుదేశములో నీయన పొందిన

ప్రతిష్ఠయే సాక్ష్యము. కాని, యీయన పద్యరచనగూడ ప్రౌఢముగా చేయగలకవి. ఇట్టికవి పరులయభిప్రాయము నాసించుట యెందులకో తెలియదు. అవతలి వానియందు గౌరవము నెరపుటకని యనుకొనుచున్నాను. మా నడుమ మైత్రి చాలా ఏండ్లుగా కలదు. కొన్ని కొన్ని యెడల నీయన నాకంటే గొప్పవాడుగా పరిగణింపబడుట నేనెరుగుదును. అట్టి నానుండి యభిప్రాయమాసించుట – వట్టి స్నేహధర్మము" విశ్వనాథ సత్యనారాయణ, విజయవాడ 10–6–74.

'విశ్వనాథ' వారన్నట్టుగానే, పుండరీక చరిత్ర, చొకామీళునికథ, నామదేవ చరిత్రము, గోరాకుంభారు కథ, నరహరిచరిత్రము, అన్న ఐదుగురు భక్తుల జీవిత చిత్రణలో ధ్వని, అలంకారం, ఉత్తమశైలీ విన్యాసం, పాకము, అనవద్య ఔచితి, అర్థవిన్యాసాది కావ్యాంగాలు, ముప్పిరిగొన్నాయి.

ద్విపద వృత్తంలోవున్నా, పుట్టపర్తి భావస్వాతంత్ర్యానికి గానీ, భాషాపటిమకుగానీ, అలంకార విన్నాణానికి గానీ యేమాత్రపు అవరోధమూ కలుగలేదు. పైపెచ్చు, మరింత సుభగసుందరంగా పుట్టపర్తివారి చేతిలో కందుకంగా ఒదిగిపోయిందీ పండరీభాగవతం.

పండరినాథుడికి మోకరిల్లి, ముగురమ్మలకూ అంజలి ఘటించి, పూర్వ కవి స్తుతి చేసిన తరువాత,

'భక్తుల దాసుండ – భక్తుల లెంక
భక్తుల పడిగాపు – భక్త జీవనుడ
భక్తి గోత్రుండ – సద్భక్తి వంశ్యుండ
భక్తి చాపల్యుండ – భక్తి బంధుండ
విదితాష్టభాషా కవిత్వ నిర్మాణ
మద బంధరుండ – కళా మహిత రాహస్య
సేవధి – నవధాన చిత్రచణుండ..'

అంటూ తన పరిచయానంతరం, ధ్వని, అలంకారము, ఉత్తమ శైలి, పాకము, అనవద్య ఔచితి, అర్థ విన్యాసము అప్పుడప్పుడు గుప్పు గుప్పున వెడలి,మోదము ముప్పిరిగొనగా విబుధకోటికై, పండరినాథుని గుణ పరీమళ గాథగా పండరీభాగవతాన్ని రచిస్తున్నానంటూ, పుండరీక గాథకు శ్రీకారంచుట్టారు పుట్టపర్తి. పండరీభాగవతంలో అనేకానేక సందర్భాలలో,



సంభాషణలు నడిపే తీరులోనూ, స్వగతాల తీరులోనూ పుట్టపర్తి ప్రతిభ అత్యంత విలక్షణంగానూ, విస్మయమంతంగానూ, బహు విషయ సమ్మిశ్రితంగానూ పఠితలను అకట్టుకుంటుంది.

ఇందులో పుట్టపర్తి కథాసంవిధాన నైపుణి, పాత్ర చిత్రణలు అద్భుతంగా సాగి అహమహమికగా సాగి, పఠితల హృదయాల్లో భక్తి కేదారాలు పండిస్తాయనటంలో సందేహమేమాత్రమూ లేదు.

**జనప్రియ రామాయణం**

పుటకు నాలుగు షట్పదుల లెక్కన దాదాపు నాలుగువేల షట్పదులతో– దాదాపు వేయి పుటల మహాగ్రంథం – జనప్రియ రామాయణం. సరస్వతీ సాక్షాత్కార ఖండము. వసిష్ఠ దయావర్షణ ఖండము, ఇష్ఠి ఖండము, అవతార ఖండము, గౌరీ వివాహ ఖండము, అహల్యా ఖండము, సీతారామ కల్యాణ ఖండము అన్న యేడు ఖండాల సంపుటి బాలకాండ. ఇక చతురస్రగతిలో సాగిన 'కిష్కింధాకాండ' మరో గ్రంథంగా వెలువడింది.

ఉత్తర హిందూస్థానంలో తాను పర్యటించేటపుడు సామాన్య ప్రజానీకంలో సైతం, తులసీదాసు రామాయణానికున్న బ్రహ్మాండమైన ప్రచారాన్ని గమనించిన పుట్టపర్తివారిలోని తపన– 'జనప్రియం'గా, ముందు 'కిష్కింద'గా ఆవిష్కృతమైంది. వాల్మీకిని అనుసరించి యీ రచన సాగినా, అటు తరువాత, కంబరామాయణం, భావార్థ రామాయణం, మలయాళ రామాయణాలను పరికించిన నేపథ్యంలో 'కైక' పాత్రకు క్రొత్తరూపాన్నిచ్చి 'బాలకాండ'ను రచించారు వారు. ఆమె వీణాప్రవీణ, చదరంగ క్రీడాసక్త, అలంకారప్రియ, శృంగారకేళీ చతుర.

*"కైకమ్మ యెత్తుకుని*
*గారాము సేయుతరి*
*చిరునవ్వు రామచంద్రుడూ నా కీర్తి*
*నీ వశంబన్నట్టులుండూ కౌసల్య*
*జోలపాడినవేళ, సాగియు భరతుడు రామ*
*చంద్రుడు లేక లక్ష్మణుడు నిద్దురపోడు"*

కైకకు యెప్పుడూ ఒకేధ్యాస. 'రామునికి విలువిద్యలలోని మెలుకువలన్నీ పట్టుదప్పకుండా నేర్పాలి. 'రావణవధ' యీతని వలెనే జరగాలన్నదే ఆమె పట్టుదల. తన కోర్కెకు రాముని బాల్యానినే పునాది వేసిందామె! "కత చెప్పవే తల్లి" అని రాముడు తన దగ్గరకు రాగానే

"రావణుండను నొక్క
రక్కసుండున్నాడు
పరమశైవుడు వీరవరుడూ ఋషిధర్మ
పద్ధతులకెల్ల శాతవుడూ మసనంపు
చైత్యంబువలె వాని శౌర్యమ్ము పెడదారి
పట్టి భూషితమయ్యు, భయకరము జీవులకు"

అని కథ మొదలుపెట్టేది కైక. అతని నీచకృత్యములన్నీ వర్ణించి చెప్పి, ఆఖరికి –

"రావణుని గెలిచి యీ
రవి వంశమున కసటు
మార్చి రాజ్యము లేలవలెనూ, నీ కీర్తి
కవుల జిహ్వాల నిల్పవలెనూ భూదేవి
గడె గడెకు యుగముగా మిడుకుచున్నది సూర్య
వంశమే పతిపోవ! భవ్యధర్మము లేవి?"

అని రాముణ్ని ప్రశ్నిస్తుంది కైక. దానికి రాముని జవాబేమిటి?

"రావణుని లోక వి
ద్రావణుని పరిమార్తు
చింతింపకే తల్లి కానా! కైకమ్మ
కనులందు హర్షంపువానా! బ్రదుకరా
రామచంద్రా! ధర్మరక్షణాధర మూర్తి
మాబోటి బ్రదుకులేమైన చింతయెలేదు"

ఇదీ కైక పాత్రను పుట్టపర్తి మలిచిన తీరు. గాధేయుని వెంట రాముని పంప వెనుకాడుతున్న దశరథునికి ఆమె యిలా నచ్చజెబుతుంది– "రఘువంశవరుల పుణ్యమంతా,



రఘునందనుని వింటిరవళిలోనే నిల్చివుంది. గాధేయుడనగా యెవరను కున్నావు? తనువున్న చాపవేదము! ఆ భృకుటి ప్రతిసృష్టి చేసే శక్తి కలిగినది. నీవు రాముని పంపకుంటే, తన తపశ్శక్తితో మరో రాముణ్ణి యీ మహికి తేగలడామౌని" అని అతని గొప్పదనం చెబుతుంది. ఇంతగా చెప్పినా దశరథుడు మంకుపట్టు వదలడు. "రాముడే పోకున్న 'రామ' పోవునుగాక" అని కోపాన్ని ప్రదర్శిస్తూ ఘనకోపకుటిలములు, కంపమాన వోష్ఠములు, నిశ్వాస కశ్మలిత వక్త్రములతో, ఘర్మజలదంతురితగా కైకేయి వెళ్లిపోయిందట– మౌనులకు వందించి!

"సౌమిత్రీ! నీ సాటువ బెట్టకు,
నీవొక ధర్మము, నిన్ను బోలినది
నీవే! మేమో! జీవులమయ్యా!
రాగద్వేషవశాత్ములమున్"

"జనప్రియ రామాయణం – మహాకావ్యం. ఒక జన్మలో పొందిన సంస్కారంవల్ల మాత్రమే ఇలాంటి రచన సాధ్యంకాదు. వెనుకటి జన్మలో పుట్టపర్తి సాధన, ఆర్జించిన సంస్కారం రెండూ తోడ్పడి, యీ జన్మలో యింతటి గొప్ప కావ్యం ఆయనచే రచింపబడునట్లు చేసింది. నేను "కవి సామ్రాట్" విశ్వనాథ శిష్యుణ్ణి! అభిమానిని! ఐనా, రామాయణ కల్పవృక్షం కంటే జనప్రియ రామాయణం చాలా విశిష్టమైనదిగా నాకు తోస్తుంది" – అన్నాడు సువిఖ్యాత కవి నండూరి రామకృష్ణమాచార్య!

'శ్రీనివాస ప్రబంధము', రెండు భాగాలుగా, ఐదు ఆశ్వాసాలుగా, 2414 పద్య గద్యాలుగా వెలసిన ప్రౌఢ ప్రబంధం, పండితైకవేద్యమైన యీ శ్రీనివాస వృత్తాంత ప్రబంధాన్ని శ్రీహరికే అంకితమొనరించారువారు. "సజ్జనశిరః కల్హారదామంగా కవనాన్ని కావింతునని పలికి మాట నిలబెట్టుకున్నారు – పుట్టపర్తివారు" అంటారు. ప్రముఖ విమర్శకులు తిరుమల శ్రీనివాసాచార్య, దీర్ఘాతి దీర్ఘసమాసాలు, అపూర్వభాషా ప్రయోగాలు, అపూర్వ కల్పనా విన్యాసకౌశలాలు, సృజనాత్మక యోషాభూషలూ యీ కావ్యంలో అనేకానేకాలు.

సీ. ఏ పరమాత్మయందీ సమస్తంబును,
నణగెడు సరణి యందగ్ని భంగి
నెవడు పాదానంబు, నెవ్వరు గర్త
యెవడు దానీ లోకమైవరలుచుండు

కార్యకారణముల కల్పనంబులకు నెవ్వని
యున్కి యప్రాప్య మనుఘుడెవడు
దనకు దానై జన్మమునుబొందు,
నిగమంబు యెవ్వని గుర్తింప నేకమార్గ

మట్టి యద్వితీయమైనట్టి వస్తువానంద
ఘనము భక్తిమందిరాంత
రంబునందు గ్రీడనంబుగా నొనరించు
సగుణమూర్తి నాకు శరణమగుత.

ఇటువంటి చక్కని, చిక్కని భక్తిభావకేదారమీ శ్రీనివాస ప్రబంధం. దీనిని స్వీకరించేందుకు యెందరో పుట్టపర్తి వారిని బదిమాలినా, "శ్రీనివాసాంకితంగానే దీనిని ప్రారంభించానుగాన దీని స్వీకర్త శ్రీనివాసుడే" అని ఘంటాపథంగా చెప్పిన అభినవ పోతన – పుట్టపర్తివారు!

'ఏ కవికైనా స్పెసిమన్ ఒకటి ఉంటుంది. దాన్ని చూసి కవి శక్తత చెప్పవచ్చు. నా సంగతికొస్తే, నా శ్రీనివాస ప్రబంధం ఉందే, అది నా స్పెసిమన్ అంటాను. ఎందుకంటే, అందులో నా పాండిత్యాన్ని, నా కవితా కళను, మా శక్తినంతా ఉపయోగించి వ్రాశాను. అందులో నా ఆశ్వాసాంత పద్యాలూ, షష్ఠ్యంత పద్యాలు ప్రబంధ కవులకు కూడా తల దిమ్మెక్కిస్తాయి. నా వర్ణనలు నా ఊహాశక్తికి ప్రతీకలు. ఐనా మాత్సర్యంతో ఊగిపోతున్న ఇప్పటి కవులకు నేనెక్కడ అర్థమౌతాను? లౌక్యం లేనివాణ్ణి కదా!! గట్టి చదువు ఇప్పట్లో ఎంతమందికుంది? కాలమే జవాబుదారీ కావాలి..' (శశిశ్రీ తో ముఖాముఖిలో)

స్వయంగా పుట్టపర్తి వారి మాటల్లోనే వారి శ్రీనివాస ప్రబంధం గురించిన వారి యీ స్పెసిమన్ రచనలోని విశేషాలు కొన్ని.

ప్రథమాశ్వాసం లోని అవతారికలో, శ్రీకారంతో కావ్యాన్ని శ్రీకరంగా ప్రారంభిస్తారు ఆచార్యులవారు.

శ్రీవైయాత్య, మసంవర ద్యుతిలసచ్ఛ్రీవత్సముత్కౌస్తుభ
ప్రావారాయిత కాంతి నేత్రం, దయాపారమ్య చక్షుర్ద్వయం,
బావేశించునుగాత, నా హృదయమందా:కారి, ప్రత్యుత్సవ
ప్రావీణ్యంబగు వేంకటాచల పరబ్రహ్మంబనాతంకమై. (శ్రీ.ప్ర. 1)



శ్రీదేవిని ధరించిన దిట్టతనముతో, ఎగజిమ్ముతున్న కాంతులతో, ప్రకాశించే కౌస్తుభ మణిని ధరించి వలివపు ఉత్తరీయముచే కప్పబడిన శ్రీవత్సాంకితమైన వక్షస్థలముతో దయను కురిపించు కన్నులతో పీడలను తొలగించి శాశ్వతమైన ఆనందమును కల్గించుటయందు, నేర్పరియైన వేంకటాచల పరబ్రహ్మము, ఏ ఆటంకమూ లేకుండా నా హృదయమునందు ప్రవేశించు గాక!! అని ప్రారంభించి, 'నా మనస్సనే పాలసముద్రపు పట్టేమంచముపై శయనించిన శ్రీమహావిష్ణూ!! పూర్వము కులశేఖరుడనే రాజు (శ్రీవైష్ణవ పన్నిద్దరాళ్వారులలో ఎనిమిదవవాడు) యీ కొండపై ఏదేని జీవిగా తనను పుట్టించమని వాపోయినాడు. భూతల వైకుంఠమైన యీ వేంకటాచలము నీగృహము. అవిరళ భక్తి లక్షణమే రక్షగా, జీవితమంతా నీ పాదసేవలో తరింపజేయవా!!' అని వేడుకుంటారు. తదుపరి, స్వామి నిత్యానపాయిని లక్ష్మీదేవినీ, అనంతుడూ, గరుత్మంతుడూ, విష్వక్సేనుడూ, విష్ణువు పంచాయుధములనూ కీర్తిస్తారు పుట్టపర్తి. పూర్వకవులను నుతించి, వంశవర్ణన తరువాత, కావ్యసృష్టికి కారణం చెప్పి, షష్ఠ్యంతములను సంధించి, 'నా విన్నపంబూను గథాక్రమం బెట్టిదనిన..' అంటూ 38 వ పద్యం నుండీ కథాప్రారంభం చేశారు.

ప్రథమాశ్వాసంలో నైమిశారణ్య నిర్వచనము, సూతునిద్వారా మునులకు శ్వేతవరాహ కల్ప వివరణ, స్వామిపుష్కరిణీప్రాశస్త్యము, నరనారాయణ ప్రాదుర్భావము, దక్షయజ్ఞము, శైలజాసముద్వాహము, కుమారసంభవము, తారకనివహనము, ధర్మగుప్త, సుమతీ వృత్తాంతాలున్నాయి. ద్వితీయాశ్వాసం, ప్రహ్లాదగాథకు కేటాయించబడగా, తృతీయాశ్వాసములో అంజనాచల, వృషభాచల, కిన్నరదంపతుల, శంఖణమహారాజ వృత్తాంతాలున్నాయి. చతుర్థాశ్వాసం, కుమారధార మహిమ, ఆత్మారాముని కథల మనోజ్ఞ వర్ణన. పంచమాశ్వాసం, మాధవుడు రామచంద్రుని రూపంలో మానవునిగా అవతరించి, రావణవధ చేయటాన్ని విస్తారంగా వర్ణించి, క్షేమేంద్రుని నిబంధననుసరించి మాలినీ వృత్తంతో కావ్యానికి ముగింపునిచ్చారు పుట్టపర్తి.

పుట్టపర్తి తన యీ రచనను తన స్పెసిమన్ రచనగా ఉటంకించటానికి కారణమైన ఇతివృత్త విశ్లేషణ,శైలీవిన్యాసం, ప్రౌఢి, నాటకీయత, అలంకరవైచిత్రి, రసస్ఫోరణము, వర్ణనావైభవము, చందోవైదగ్ధ్యము, లోకానుభవము, భాషాపరంగా సామెతలు, నుడులు, చాటువులూ వంటివాటి నిర్వహణలను వివరించబూనుకోవటం, గ్రంధవిస్తృతికి కారణ మౌతుంది. ఆసక్తిగల్గినవారు మూలగ్రంథాన్ని పఠించి ఆచార్యులవారి శేముషిని అంచనా వేసుకోవచ్చును.

విష్ణు, వరాహ, బ్రహ్మాండపురాణాదులనుండీ కథాసంచయం చేసుకుని, ఒకటిరెండు కథలను, కథాంతర్భాగాలను జోడించి, వాటికి తగ్గ శైలిని పాటిస్తూ, సంస్కృతాంధ్రాలకు సమాన ప్రాముఖ్యతనిస్తూ, తెలుగు జాతీయాలు, విలక్షణ పదప్రయోగ పరిమళాలను అద్ది, అన్నిటికీ మించిన వ్యుత్పత్తితో, పాండితితో, ప్రాచీన నవ్య సంప్రదాయాల మేలు కలయికగా చిక్కని రచననందించిన శ్రీ పరమ భాగవత పాదరజ:పుంజ విమలీకృత మనోదర్పణుడైన శ్రీమత్తిరుమల నారాయణాచార్య వర్యునికి నమస్కృతి.

**పుట్టపర్తి సంస్కృత రచనలు :**

తెలుగులోనేకాక సంస్కృతంలోనూ కృతులను విరచించి, తల్లి సేవచేసిన అచ్చమైన పుత్రుడు – పుట్టపర్తివారు. సంస్కృతంలో 'శివకర్ణామృతమ్', 'త్యాగరాజ సుప్రభాతమ్', 'అగస్త్యేశ్వర సుప్రభాతమ్', 'శ్రీశివలీలాస్తవమ్', 'మల్లికార్జునసుప్రభాతమ్' మొ॥లగు రచనలు దాదాపు అన్నీ 'శివస్తుతి' కోసం కేటాయించినవే!

"శేషశైల శిఖరాధివాసినః కింకరాః పరమవైష్ణవావయం
తత్తథాపి శశిఖండ శేఖరే, శాంకరే మహసి లీయసే మనః"

అంటూ "పరమవైష్ణవుణ్ణయినా, శంకరాకృతి కాంతిలోనే మనసు లీనమవు తూంది." అని ఉద్ఘాటించారాయన. 'శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే" అనికదా ఆర్యోక్తి! 'శివకర్ణామృతమ్'లోని నలభైతొమ్మిదవ శ్లోకంలో ఉటంకించినట్టు, శివనామోచ్చారణకే వారి హృది వినీతమవుతుందట సదా!

*"గురవేనమోస్తు, మురవైరి మస్తక*
*ప్రలసన్మణీగణ విరాజితాంఘ్రయే*
*నవసాంధ్యవర్ణ గజకృత్తివాససే*
*భువనావనాయ దృఢ చిత్తమూర్తయే"*

విష్ణుశిరస్థలంపై వెలిగే మణులతో విరాజిల్లే, శివుని పాదపద్మాలను కీర్తించే 'పుట్టపర్తి'లో వినయవినమితాంగుడైన శివభక్తుడే దర్శనమిస్తాడు.

అగస్త్యేశ్వర సుప్రభాతంలోనూ శివతాండవ కావ్యనాయకుడే– కందర్ప దర్పహరసుందర దివ్యకీర్తిగానూ, దేవాంగనావలిత దృక్పరిపూతమూర్తిగానూ, పశుపతిగానూ పుట్టపర్తియందు ప్రత్యక్షమవుతాడు.



*"యాదేవీ త్రిపురేతి వేదవిదుషాం సంసత్సు సంగీయతే*
*యానీలోత్పల సన్నిభాంగరుచిరా యా యోగ పద్మాసనీ*
*యా వామాంగ ముపస్థితాపశుపతేః యాతద్దయావర్ధినీ*
*తాం మందస్మిత మంజరీ వ్యతికరాం వందే జగన్మాతరమ్"*

వేదపండితుల సభలలో త్రిపురగా గానం చేయబడే దేవి, నల్లని కలువలకు సమానమైన శరీరకాంతితో ప్రకాశించే దేవి, యోగపద్మాసనంలో విరాజిల్లే దేవి, తన చిరునగవుల పూగుత్తులను వెదజల్లే దేవి, ఆ లోకమాత, జగదంబికకు వందనాలర్పించారు వారు.

*"దారాసుతాది బహుగుణ విగాహితానాం*
*మాయావిభూత మనసాం పరమన్యపుంసః*
*ఉద్ధర్తుమేవ జనిమాస్తవతః ప్రపంచే*
*శ్రీత్యాగరాజ భగవన్! తవ సుప్రభాతమ్"*

*(త్యాగరాయ సుప్రభాతమ్)*

మాయాభిభూత చిత్తులైన మానవులను, భవసముద్రం నుండి దాటించేందుకు త్యాగరాజు ప్రయత్నించాడని– పుట్టపర్తివారి అభిప్రాయం. ప్రపంచంలో పుట్టి బ్రదికే మానవుడు కవైనా, పండితుడైనా, గాయకుడైనా, వైష్ణవ మాయా ప్రభావంచేత, భార్యాబిడ్డలతో గూడిన పెక్కు కష్టాలు పడక తప్పదు. తనలాగే యితర మానవులూనూ! అలాగే యిందులోనూ త్యాగరాజు సైతం యిలాంటి కష్టాలు చాలా పడ్డాడంటారు పుట్టపర్తి పై సుప్రభాత రచనలో.

'అభినవ కాళిదాస' బిరుదాంకితులైన పుట్టపర్తివారి మరో సంస్కృత రచన శ్రీ శివలీలాస్తవమ్(2000)

*చాంద్రీపునాత శశికుట్మల మండనస్య*
*మాధుర్యసార విదుషో మదనాతిగస్య*
*రత్యంతరేషు గిరిజా పదయావక శ్రీ*
*కౌసుంభరాగ భరితానత కామధేనుః –*

ఈశ్వరుని జటాజూటమునందున్న తెల్లని చంద్రకళకు, పార్వతితో రతి పారవశ్య విలాస సమయాన, ఆమె పాదములకున్న పారాణి అంటినది. అట్టి ఎరుపురంగు నలదుకున్న యీశ్వరుని చంద్రరేఖ – మమ్ము పావనము చేయుగాక!"

పుట్టపర్తివారిలా పార్వతీపరమేశ్వరుల శృంగార రహస్యాలను తమ 'స్తవం'లో చేర్చటం– కేవలం పారలౌకిక మహానందసాధనమేకాని, ఇహలోకసుఖాలకు సంబంధించినది కాదు. కారణం భక్తాగ్రేసరులైన నారాయణతీర్థులు, జయదేవుడు, క్షేత్రయ్య మొదలైన వాగ్గేయకారులు కూడా భగవంతుని 'దాంపత్య శృంగారాన్ని కీర్తించినవారే' 'సౌందర్యలహరి'లో శ్రీశంకర భగవత్పాదులు– అమ్మవారి సౌందర్యాన్ని వివిధరీతుల వర్ణించటమే – వీరికి స్ఫూర్తినిచ్చి వుండవచ్చు. అన్నమయ్య శృంగారానికి తన పదాలలో పెద్దపీటే వేసిన సంగతి జగద్విదితం.

**పుట్టపర్తి ఆంగ్ల రచనలు :**

పిట్ దొరసాని ప్రభావంతో మొదలైన ఆంగ్ల సాహిత్య ప్రభావం, తరుణ పుట్టపర్తిని కవితా లోకాల్లో విహరింపజేసింది. పైగా జేంస్. హెచ్. కజిన్స్ అనే సువిఖ్యాత విమర్శకుడు, ఒకసారి అనంతపురం కాలేజీలో చేసిన ఉపన్యాస పరంపర పఠనాసక్తిని మరీ పెంచింది. మిల్టన్, కీట్స్, షెల్లీ,టీ.ఎస్. ఇలియట్ – వీళ్ళంతా పుట్టపర్తికి మంచి స్నేహితులైపోయారు. దాదాపు అందరూ మనోవీధుల్లో కొలువు తీరి ఉండి, 'మా సంగతి సరే? మరి నీ కలం మాటేమిటి??' అని ప్రశ్నిస్తున్నట్టే ఉండేది. ఆమె వద్ద విషాదాంత నాటకాలను చదివే సమయంలో, ఆ పరవశం, లీవ్స్ ఇన్ ది విండ్ అన్న కావ్య రచనకు కారణమైంది. అప్పుడు పుట్టపర్తి నూనూగు మీసాల 'ఊన వింశతిలో ఉన్నారు. కానీ పిట్ అన్న ఒక మాట పుట్టపర్తి ఉత్సాహానికి అడ్డుకట్ట వేసింది. 'నువ్వెంతైనా ఆంగ్ల సాహిత్యం చదువు. ఆ జ్ఞానంతో నీ భాషను పరిపుష్టం చేసుకో!! కానీ సొంతంగా ఇంగ్లీష్ లో రచనలు చేసే సాహసం చేయకు. ఇంగ్లీష్ మాతృభాషైన వారి పలుకుబళ్ళకూ, నేర్చుకుని వ్రాసేందుకూ చాలా తేడా ఉంటుంది మరి!! గుర్తింపు రావటం చాలా కష్టం..' పెనుగొండ నుండీ ప్రొద్దుటూరుకు మరి, అటునుండీ కడపలో స్థిరపడిన తరువాత, ఉబలాటం కొద్దీ, మిత్రులతో కూర్చున్నప్పుడు, ఆంగ్ల కావ్య పఠనం అప్పుడప్పుడూ చేసినప్పుడు, వారంతా మెచ్చుకునేవారు!! అలా అలా, ఒక మిత్రుని ప్రోద్బలంతో, 1953లో సరోజినీదేవి నాయుడు తోబుట్టువు, సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత, శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయ్ కి లీవ్స్ ఇన్ ది విండ్ వ్రాత ప్రతి పంపటం, వెంటనే 10–4–1953 (అప్పటికింకా యీ రచయిత్రి జన్మించలేదు) నాడు వారు తమ ప్రశంసాపూర్వకమైన అభిప్రాయాన్ని వ్రాసి పోస్ట్ చెయటమూ – తన జీవితంలో మరపురాని సంఘటనగా పుట్టపర్తి అనేవారు. సౌందర్యం పట్ల ఆరాధన, సమాజం పట్ల వేదనా, భవిత పట్ల విశ్వాసం – వీటన్నిటికీ, మాతృభాషకాని, తాను నేర్చిన భాషైన ఆంగ్లంలో సాధికరంగా 19 యేళ్ళ వయసప్పుడే కవితారూపమివ్వటం, అత్యంత సాహస కృత్యమే కదా!!

Poetry is vital force turned into words,  
By an unknown chemist,  
In an unknown Laboratory.

ఒక అపరిచిత వైజ్ఞానిక శాస్త్రవేత్త ద్వారా ఎవరికీ తెలియని ప్రయోగశాలలో పదాలుగా మారిన ప్రాణాధార శక్తిగా కవిత్వాన్ని ఒక పదునెనిమిదేళ్ళ యువకుడు నిర్ధారించటం, 'పరిణత కవివాణి.' కదా? 'భయంకరమైన యాంత్రిక జీవనానికి దూరంగా చేతిలో ఒక పుస్తకం, ప్రశాంత మానసం, నదీ తీరాన ఓ చిన్నారి సామీప్యం..వీటన్నిటి మధ్యా..ఓ మృత్యువా!! నన్ను చేరుకో!!' గాఢమైన జీవితానుభవం రంగరించి పోసిన యీ భావాలు, హరీంద్రనాథుని మనసునే హరించివేశాయి.

This collection does give us an insight into the soul, heart and mind of a genuine poet. It is a book of sensitive poetry... అనేలా చేశాయి.

ఐనా సరే, దాన్ని ముద్రింపజేసుకునే ప్రయత్నాలేవీ చేయలేదు. దానికి తగ్గ ఆర్థిక స్థోమత లేకపోవటమొక కారణం కాగా, పిట్ దొరసాని మాటలు పదే పదే గుర్తుకు రావటం మరో కారణం!!

కానీ కడపలో ఎన్నో సంవత్సరాలుగా సాహితీసేవ చేస్తున్న రచన సాహిత్య వేదికవారు, పుట్టపర్తివారు అనుమతిస్తే, తాము ముద్రిస్తామని ముందుకు రావటం వల్ల 1987 లో శ్రీయుత ఎన్.సీ.రామసుబ్బారెడ్డి, డీ.కేశవ రావు, వల్లంపాటి వెంకట సుబ్బయ్యల సహకారంతో పుస్తక రూపం దాల్చిన యీ కవితాసంకలనాన్ని, ఎటువంటి మార్పులూ చెయకుండా ప్రచురణకివ్వటం ఆశ్చర్యమే!!

ఒక్క సంగతి. తాను పంధొమ్మిది సంవత్సరాల వయసులో వ్రాసిన ఆంగ్ల కవితాసంపుటి, ఒక లబ్ధ ప్రతిష్టుడైన సరస్వతీపుత్రుడు, డెబ్భై ఏళ్ళ వయసులో ప్రచురణకు వస్తున్నప్పుడు, కాస్తయినా సరిదిద్దకపోడు – ఇప్పుడు తనకున్న కీర్తి నేపథ్యంలో!! కానీ పుట్టపర్తివారు అటువంటి ఊగిసలాటకు తావివ్వక, యధాతథంగా ఆ కావ్య సంకలనాన్ని ముద్రించటం, వారి నిజాయితీని మరింతగా స్పష్టం చేస్తుంది.

శ్రీ అన్నవరం ఆదిశేషయ్య 'లీవ్స్ ఇన్ ది విండ్' ని తెలుగులోకి సమర్థవంతంగా అనువదించారు.

పిట్ దొరసాని శిష్యరికంలో ఏర్పడిన ఆంగ్ల సాహిత్య పరిచయం, మిల్టన్ పారడైస్ లాస్ట్ ను కంఠస్థం, షేక్స్పియర్ నాటకాలను మేధస్థం చేసిన తరువాత, వయసులోనూ, అనుభవం లోనూ పండిన పుట్టపర్తి లెఖిని దుర్యోధనుడు నాయకుడుగా ది హీరో అన్న అంగ్ల నాటకానికి శ్రీకారం చుట్టింది. కథాసంవిధానం, పాత్రపోషణా..అన్నీ ఆచార్యులవారి కల్పనాపుష్టికి ప్రతిబింబాలే!! పురాణ సంబంధ ఇతివృత్తం కాబట్టి షేక్స్పియర్ నాటి పాత ఆంగ్ల భాషనే ఎంపిక చేసుకున్నారు వారు. పుట్టపర్తి వారి ఆరాధకుడూ, సుప్రసిద్ధ విమర్శకుడూ, ఆంగ్లాచార్యుడూ ఐన శ్రీ వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారు, 28 మార్చ్ నాటి తన ఒకనొక వ్యాసంలో (ఆంధ్రజ్యోతి దినపత్రిక) 'గంభీరమైన ప్రాచీన ఇతివృత్తం కాబట్టి,ఎలిజబెత్ కాలం నాటి ఆంగ్లాన్ని వాడారు పుట్టపర్తి వారు. ఆనాటి ఇంగ్లీషు నుడికారం, పదప్రయోగం, యీ 400 సంవత్సరాలలో ఊహాతీతంగా మారిపోయాయి. అందుకే ది హీరో లోని అలనాటి ఇంగ్లీష్, ఈనాటి సంప్రదాయానికి విరుద్ధంగా తోచి, పాఠకులకు వింతగా అనిపించినా, యీ నాటకం ఒక విశిష్ట తెలుగు విద్వాంసుడు చేసిన విశిష్టమైన ఇంగ్లీషు ప్రయోగం..' అన్నారు. ఇందులో స్వగతాలు (soluloquies), పాత్రలను మలచిన తీరు, భాషాప్రావీణ్యత, పాండితిలలో పుట్టపర్తి ముద్ర సుప్పష్టమని వారి విమర్శకులంటారు.

భానుమతి యుద్ధ కుశలత, ఆమె అతీత సౌందర్యాధకునిగా దుర్యోధనుని ఏకపత్నీత్వం, అతగాని సంగీత ప్రియత్వం, మరణ భయమున్నా సంగీతాకర్షణకు లొంగిపోయే రసహృదయం – ఇవీ మూల కథకు పుట్టపర్తి చేసిన మార్పులు. యుద్ధ భూమికి వెళ్తున్న దుర్యోధనుణ్ణి, భానుమతి అడ్డగిస్తుంది.'నేనూ వస్తాను నీతోపాటూ, అర్జునుని వింటినారిని తెగగొట్టాలి నేనే!! అప్పుడాతని ముఖంలో మారే రంగులు నేను ప్రత్యక్షంగా చూడాలి..' అంటుంది. ఆమె కోరిక నెరవేరుతుంది !! అర్జునుని రథసారధ్యం చేస్తున్న శ్రీకృష్ణుని ప్రశంసాపాత్రమౌతుంది కూడా!! కానీ, ఇంతలో వెనుక నుంచీ, ఎవరో ఆమెపై దాడి చేయగా, అక్కడే నేల కూలుతుంది. దుర్యోధనుడు, తల్లడిల్లి పోతాడు. భార్య మరణం అతన్ని కుంగదీస్తుంది. యుద్ధ భూమినుండీ వెళ్ళీపోతాడు.

ఇక భానుమతంటే ద్రౌపదికి చాలా ఇష్టం. కారణం తన వస్త్రాపహరణం సందర్భంలో దుర్యోధనుణ్ణి ధైర్యంగా అడ్డుకుంది భానుమతి!! ద్రౌపది శ్రీకృష్ణుని వద్ద మురళిని అభ్యసిస్తుంది.



దుర్యోధనుడు వీణాలోలుడు. సంగీతాకర్షణ అతన్ని కృష్ణుణ్ణి ఇష్టపడేలా చేస్తుంది.(కర్షతీతి కృష్ణః కదా మరి!!) ఇక దుర్యోధనుడు ద్వైపాయన హ్రదంలో దాక్కున్నప్పుడు పాండవుల పరుష వాక్కులూ, వ్యంగోక్తులూ అతన్ని బధించవు. బైటికి రప్పించనూ లేవు. ఈ రహస్యమెరిగిన కృష్ణుడు, మురళిని చేతుల్లోకి తీసుకుంటాడు. సంగీత మాధురీబంధంతో దుర్యోధనుణ్ణి బైటికి రప్పించి, హతుడయ్యేలా చేస్తాడు. ఆఖరి శ్వాస వదులుతూ దుర్యోధనుడు,'సిగ్గు లేకుండా, సంగీతాన్ని ఆశ్రయించి, నన్నిలా బైటికీడ్చుకొచ్చి, హతమరుస్తావా?? నీ మురళే నన్ను బలిగొనింది సుమా!!' అంటాడు.

ఇటువంటి విశిష్ట కల్పనలతో కూడిన పుట్టపర్తి వారి ది హీరో ఆంగ్ల నాటకం నాటకం, ఆచార్య లక్ష్మణ మూర్తి గారిని (సుప్రసిద్ధ ఆంగ్లాంధ్ర రచయిత, విమర్శకులు, వరంగల్ వాస్తవ్యులు, నృసింహ ప్రియ పుట్టపర్తి స్మారక సంచిక 1991), 'This play in any case, is an attempt to accommodate the oriental exuberances in the confines of English..' అనేలా చేసింది.

పుట్టపర్తివారి మరొక ఆంగ్ల రచన భాగవతం పదవ అధ్యాయం. ఈ వచనానువాదం తిరుమల తిరుపతి ఆంగ్ల మాస పత్రిక సప్తగిరి లో ధారావాహికంగా దాదాపు ఆరు మాసాలు ప్రచురితమైంది. పుస్తక రూపంలో అలభ్యం. పుట్టపర్తికి అత్యంత ప్రీతిపాత్రమూ, ఆరాధ్యదైవమూ, అష్టాక్షరీనాధుడూ ఐన శ్రీకృష్ణుని బాల్య క్రీడలను తనివిదీరా ఆంగ్లంలోనూ నైష్ణ్యంగా ఆవిష్కరించి అటు రసిక పాఠకులనూ, వారు ఆనందింపజేశారు.

విశ్వాసం, అవిశ్వాసం, దేశభక్తి, కోపం, అసహనం – అన్నీ వున్నకావ్యమిది. చక్కటి సమకాలీన భాష, సూటిగా, తేటగా వున్న శైలితో ఆకట్టుకునేలా వుందంటారు– సుప్రసిద్ధ విమర్శకుడు శ్రీ వల్లంపాటి వెంకటసుబ్బయ్య (ఆంధ్రజ్యోతి, మార్చి 28, 2005)

"షేక్స్పియర్, మిల్టన్ నాకు ప్రాణప్రదమైన వాళ్ళు" అనే పుట్టపర్తి, వీరిరువురి ప్రభావంతోనే "ది హీరో" అన్న ఆంగ్లనాటకాన్ని, దుర్యోధనుడు కథానాయకుడుగా వ్రాశారు.

*"The sun is set, the west is bleeding,*
*Bleeding is my heart, his son has set,*
*sun is son, Two lights are extinguished"*

"అటు ఆకాశాన సూర్యుడు, యిటు అవనిపై కర్ణుడూ యిరువురూ, మాయమయ్యారు. నా హృదయం దహించుకుపోతున్నది" అన్న దుర్యోధనుని స్వగతంతో మొదలయ్యే ఈ

నాటకం – "ఒక తెలుగు విద్వాంసుడు చేసిన విశిష్టమైన ఇంగ్లీషు ప్రయోగం"గా పండితుల ప్రశంసలనందుకుంది.

ఇలా సంస్కృతాంధ్రాంగ్లాలలో పుట్టపర్తి తన 'సాహితీ పరాక్రమం' ప్రదర్శించి 'సరస్వతీపుత్ర' బిరుదాన్ని సార్ధకం చేసుకున్నారు.

**కథ, నవలకారునిగా పుట్టపర్తి**

పద్య,గేయ,కీర్తనా సాహిత్యాలలో తనదైన ముద్రను ఆవిష్కరించిన పుట్టపర్తి వారు, కథ,నవలా ప్రక్రియల్లోనూ తన ప్రావీణ్యతను నిరూపించుకున్నారు.

6,7,8 తరగతి విద్యార్థుల కోసం (అప్పటి 1,2,3 ఫారములు) 1953 ప్రాంతాలలో, భాషాప్రయుక్త రాష్ట్రమేర్పడిన తొలి దినాలలో, నారదుడు, విశ్వామిత్రుడు, కర్ణుడు, శిశుపాలుడు, వేదాంత దేశికులు, విద్యారణ్యులు, త్యాగరాజు, సమర్థ రామదాసు, రుద్రమ, ఝాన్సీరాణి, తిలక్, పొట్టిశ్రీరాములు వంటి సుప్రసిద్ధ పౌరాణిక, చారిత్రక, రాజకీయ ప్రముఖుల జీవితాంశాలను చిన్న చిన్న కథలుగా వ్రాయగా, టీ.బీ.సీ. మదరాసు వారు,ఆయా తరగతులకు పాఠ్యాంశాలుగా గుర్తించారు.

అలాగే ఆంధ్రప్రదేశ్ పాఠ్యగ్రంధాల కమిటీ గుర్తింపు పొందిన రచన 'విజయ తోరణము.' విజయనగర వేసవి రాజధాని పెనుగొండ వాస్తవ్యులైన పుట్టపర్తివారికి విజయ నగర సామ్రాజ్య చరిత్ర అభిమాన విషయం కావటంలో ఆశ్చర్యమేమీ లేదు కదా!! ఘనగిరిగా పిలువబడే పెనుగొండ రాజు దేవరాయలు,సంతాన లేమి వల్ల, పట్టపు రాణి రత్నవతి అనుమతితో, సానివారింటి ఆడపడుచు రంగాదేవిని వివాహమాడుతాడు. ఆమెతో పాటూ, ఆమె సోదరుడు, సవరము నారప్ప కూడా అంత:పురంలోకి ప్రవేశిస్తాడు. కానీ, రాజ్యాన్ని తాను చేజిక్కించుకోవాలనే దృష్టి అతనిది!! దానికి చెల్లెలు అడ్డమైతే, ఆమెనూ తప్పించేందుకు వెనుకాడకూడదని అతని పట్టుదల. ఈ సంగతి గ్రహించిన అమాత్యులవారు, దేవరాయల తమ్ముని కొడుకు తిమ్మరాజును రాజు సమ్మతితో పిలువనంపుతాడు. అటు దేవరాయలు, భార్యలతో కాశీ దర్శనానికి వెళ్ళామనుకుంటాడు. కానీ సవరం నారప్ప సలహాతో, రంగాదేవి, తాను ఇక్కడే ఉండి రాజ్యం యోగ క్షేమాలు చూసుకుంటాననీ, రాజుగారు కాశీ యాత్ర విజయవంతంగా చేసుకు రావాలనీ అంటుంటే, 'ఆహా, ఏమి దేశ భక్తి..'అని దేవరాయలు మురిసిపోతాడు.



దేవరాయలు తన పట్టపురాణితో కలిసి అటు వారణాసి యాత్రకు వెళ్ళగానే పరిణామం ఎటు తిరిగిందన్నదే ఉత్కంఠభరితమైన కథ. కథను నైపుణ్యంతో నడుపుతూనే, దేవరాయల కన్నా ముందు హరిహర బుక్కల పాలన ఎలా ఉండేదో చెబుతూ, అప్పటి ప్రజల కళాపిపాసను కూడా పరిచయం చేస్తారాయన!! అప్పటి రాచరిక సంప్రదాయాలూ, వేషభూషలు, అలంకారాలూ, ప్రజల సంగోత నాట్యాభిరుచులూ, ఇవన్నీ కూడా ఎంతో చక్కగా వర్ణించారు పుట్టపర్తి వారు.

న్యూనిజ్, పయస్ వంటి విదేశీ రాయబారుల ప్రశంసలందిన శ్రీకృష్ణదేవరాయల జీవితం లోని అనేక కోణాల కథారూపం, తదుపరి కథ 'రామరాయలు.. తిమ్మరుసుకు కనుగ్రుడ్లు పీకించివేశాడు, పుత్ర ప్రేమతో కృష్ణదేవరాయలు. తరువాతి కథలో అతని అల్లుళ్ళు అళియరామరాయలు, తిరుమలరాయలు, రాజ్యాన్ని చూసుకుంటుండగా, తన తదనంతరం రాజ్యమేమౌతుందోనన్న దిగులుతో అళియరామ రాయలుతో కృష్ణదేవరాయలన్న మాటలూ,ఆ తరువాత, ముస్లిముల కుయుక్తులు, సలకం తిమ్మడి నిర్వాకం, చివరికి కథ సుఖాంతం కావటమూ– ఇవన్నీ సునియోజితంగా అల్లారు పుట్టపర్తి వారు.

పై రెండు  పెద్ద కథలూ, విజయ తోరణము అన్న శీర్షికతో పుస్తకంగా రాగా, కర్మయోగులు అన్న పేరుతో, కాపయనాయకుడు, జంబుకేశ్వరుడు అన్న యోధుల కథలు పుస్తక రూపం దాల్చాయి. ఒకే శతాబ్దంలోని ఇరువురు సాహస వీరులను కర్మ యోగులుగా పేర్కొంటూ, ఒకరు జాతిధర్మానికీ, మరొకరు విశ్వధర్మానికీ కేతనాలుగా వెలుగొందారంటారు వారు.

ముస్లిం పాలనకాలంలో ఆంధ్ర రాజుల అనైక్యత ఎటువంటి పరిణామాలకు కారణమైనదో, ఐనా ఓరుగల్లు లో కాకతి వైభవ కాంతులను కాపయనాయకుడు విస్తరిల్లాజేసిన తీరును వర్ణించారు మొదటి కథలో!! కాకతి ప్రతప రుద్రుని శౌర్యం, వీర శైవ, జైన సంప్రదాయాల విద్వేశాలూ, మాలికాఫర్ దాడులు, ప్రతాపరుద్రుని ఓటమి, ముస్లిం రాజులపై ప్రజా ఉద్యమ కారుల తిరుగుబాటు తరువాత, తిరిగి ఆంధ్ర పరాక్రమత్వానికి జైకొట్టాలనిపిస్తుందంటారు పుట్టపర్తి వారు.

తరువాతి కథ, కంపిలి రాయడు జంబుకేశ్వరునిది. జనరంజకంగా పాలన సాగిస్తున్నప్పుడు, ఖాజజహా, తుగ్లక్ కుయుక్తులవల్ల జంబుకేశ్వరుని కోటనెలా ఆక్రమించారన్నదే కథాంశం. తన శరణు జొచ్చిన బహాదుద్దీన్ అన్న ముస్లిం చిరు పాలకునికి ఆశ్రయం

కల్పించటమే జంబుకేశ్వరుని దోషం.కానీ, ఇచ్చిన మాటతప్పని జంబుకేశ్వరుడు, కులమతాలకతీతంగా తన మనసు చెప్పేమాటకే ప్రాధాన్యతనిచ్చి, చివరివరకూ ముస్లిం సేనలతో పోరాడటం, రాజ కుటుంబాలకు కళంకమంటకుండా రాజ పరివారంలోని స్త్రీలు మంటలకు తమను తాము అర్పించుకోవటమూ, కంపిలిరాయడు వీర యోధునిగానే నేలకొరగటం – ఎంతో ఉద్విగ్నంగా వర్ణించారు పుట్టపర్తి వారు.

అభయప్రదానము, హరిదాసి, ప్రతీకారము..యీ మూడూ బహుళాదరణ పొందిన పుట్టపర్తివారి చారిత్రక నవలలు.

సోలగుడనే నరరూప రాక్షసుని చేతచిక్కిన యువ దంపతులు చిన్నప్ప నయకుడు, మంగమ్మలకు, అచ్యుతరాయల కుమారుడు, రఘునాధనాయకుడు, అభయమిస్తాడు. తన ప్రాణ మిత్రుడు యజ్ఞ నారాయణ దీక్షితుల సాయంతో ఎలా వారిని విడిపించాడన్నది 'అభయ ప్రదానము' ఇతివృత్తం. జింజికోట, శ్రీరంగపట్టణం, కోలరూన్, కాళహస్తి, అహోబిలము వంటి చారిత్రక ప్రదేశాల విశేషాలు అదనపు అందాలు. నాయక ప్రతినయక వ్యూహ రచనలూ, దానికి తగ్గ కథాకథనం, సంభాషణలూ, పఠితలను మంత్ర ముగ్ధులను చేస్తాయి యీ నవలలో!!

ఇతివృత్తాన్ని సమర్ధవంతంగా నడుపుతూనే, సంగీత నాట్య చారిత్రక విశేషాలను కూడా అదనంగా రఘునాధరాయల మాటల్లో వినిపిస్తారు పుట్టపర్తి. తళ్ళికోట యుద్ధ నేపథ్యం, జింజి కోటకు ఆ పేరు వచ్చిన వైనం, సంగీత సుధ అన్న గ్రంధాన్ని వ్రాసిన రఘునాధ నాయకుని సంగీత ప్రజ్ఞ, , వెంకటమఖి నూత్న రాగ కల్పనము, కమలకణ్ణి దేవాలయ వర్ణన – ఇవన్నీ అభయ ప్రదానము నవల విలువను పెంచయనటంలో సందేహం లేదు.

ఇక 'ప్రతీకారము' నవల ఇతివృత్తం, టిప్పు సుల్తాన్ పరిపాలనా కాలంలో కర్ణాటక రాజ్యం పై, ఆంగ్ల, మరాఠా సైన్యం దండెత్తగా, ప్రధాన నాయకుడు నారాయణ శాస్త్రి వారిపై ప్రతీకారం తీర్చుకోవటం. ప్రధాన కథను నడుపుతూనే, బ్రహ్మ రాక్షసి శ్రీరంగభట్టు కథ, కాశీలో శంకర భగవత్పాదులు వారికి దేవాలయం కట్టించిన వృత్తాంతం, క్రీ.శ. 1599లో చెన్న మల్లికార్జున దేవాలయంలో అభినవ నృసిమ్హ భారతీస్వాములవారు, చిత్రించిన గణపతి చిత్ర పూర్వాపరాలూ, శృంగేరి భారతీస్వామి పట్ల టిప్పుసుల్తాన్ గౌరవాదరాలూ, ఇవన్నీ చొప్పించిన వైనం ప్రశంసనీయం.

నిష్ఠాగరిష్టుడైన నారాయణ శాస్త్రి, తనను ప్రేమించిన ఆయేషా కోసం ముస్లిం గా మారిపోయేటప్పుడు, 'ఏనాడు, హిందువులే ఐన మహారాష్ట్రులు శృంగేరిని ముట్టడించారో



ఆనాడే మతమునకు అర్థము మారిపోయినది..' 'నాది మానవ ధర్మము..' అన్న శాస్త్రి మాటలు ఆలోచింపజేస్తాయి.

ఇక హరిదాసి నవల. ఔరంగజేబుకు రాజ్యకాంక్ష ఎక్కువ. తోటి ముస్లిములనూ లెక్క చేయడు. గోల్కొండ నవాబు, అబుల్ హసన్ విలాసలోలుడు. మాదన్న మంత్రిపైనే రాజ్య భారమంతా!! తన మొదటి కుమారుడు షా ఆలమ్ను గోల్కొండను స్వాధీనపరచుకు రమ్మని పంపుతాడు ఔరంగజేబు. మరాఠా రాజు సాంభాజీ శివాజీ కుమారుడు. ఇతనికి అబుల్ హసన్ విధేయుడు. వీరు నలుగురి మధ్యా కథ ప్రధానంగా నడుస్తుంది. ఉత్తర భారత దేశపు ముసల్మాన్ రాజులకూ, దక్షిణాన ఉన్న ముస్లిము రాజులకూ భేదాలుంటాయట! మాదన్న ధన్నాయకుని మాటలివి. అదెలా? నవల చదివితే తెలుస్తుంది. నూరున్నిసా ఉదంతం, 'అల్లా ఇచ్చు మేరకు వర్తించుటయే మానవ ధర్మము..' "ఈ గోల్కొండ ముసల్మానులు షేక్ జాతివారు. షేక్ జాతిని అంతమొందించుటే పాదుషా లక్ష్యము..' ఇటువంటి కథనాలు నవల ఉత్కంఠతను పెంచే అంశాలు.

ఖామంద్, ఖిల్లతులు, ముజల్ షరీక్ వంటి వుర్దూ పదాలూ, చక్కటి తెలుగు పలుకుబళ్ళూ, అందమైన వర్ణనలతో పుట్టపర్తి కలం, కథాంశాన్నీ, అంతే అందంగా ప్రస్తుతీకరించిందనటంలో సందేహం లేదు.

ముఖ్యంగా హరిదాసి సాహసం, షా ఆలం హృదయ నైర్మల్యత, ఇబ్రహీం స్వామి భక్తి, ముంతాజ్ ప్రతీకార భావన, ఔరంగజేబు యుద్ధనీతులు – ఇవన్నీ నవల విలక్షణతను ద్విగుణీకృతం చేశాయి. కావ్యరచనలోనే కాదు, నవలా నిర్మాణంలోనూ నారాయణాచార్యులవారి లేఖిని నైపుణీమంతమైనదని నిరూపిస్తాయి.

**విమర్శకునిగా పుట్టపర్తి**

పుట్టపర్తి వారి ధీరధిషణనూ, రసికతనూ వేనోళ్ల పొగిడేలా చేసే విమర్శ గ్రంథాలు – 'ప్రబంధ నాయికలు', 'రాయలనాటి రసికతాజీవనము', 'విజయనగర సామాజిక చరిత్ర', 'మహాభారత విమర్శనము', 'వ్యాససంపుటి', 'వసుచరిత్ర సాహితీ వైభవము', 'తెలుగు తీరులు', 'వాగ్గేయకారులు– పదకృతి సాహిత్యం' మొదలగునవి.

పుట్టపర్తివారు పదునాలుగు భాషలలో ప్రజ్ఞాధురీణులు, ఆయా భాషా సాహిత్యాలలోని సాహితీధోరణులూ, ప్రక్రియలూ, కవితాశైలులూ, కవుల సాహితీవ్యక్తిత్వాలూ, చారిత్రక

విశేషాలూ, కళామార్మిక శిల్పాలూ వారికి కరతలామలకాలు. ఆ అనంత పరిజ్ఞానం – తెలుగులో వెలుగురేఖలు చిమ్మటానికి పుష్కలంగా తోడ్పడేది. అందువలన పుట్టపర్తివారి ప్రతి ప్రసంగం లేదా వ్యాసంలో భారతీయ భాషాసాహిత్య విజ్ఞాన సర్వస్వం ప్రతిఫలించేది. భారత, భాగవత, రామాయణాలు మొదలు మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్యం యిలా పురాణాల నుండీ ప్రబంధాల వరకూవారు విహరించని చోటేలేదు. వ్యాఖ్యానించని ప్రక్రియే లేదు. ప్రాకృత భాషా సాహిత్యాల నుంచి అధునాతన దాదాయిజం, సర్రియలిజం వరకూ అన్ని వాదాల మూలాలనూ వారు విశ్లేషించారు. ఇలా పుట్టపర్తివారి తీక్ష్ణదృష్టి. పదునాల్గు భాషల సాహితీమూలాల నుంచి, చిటారుకొమ్మలవరకూ ప్రసరించింది. "నన్నయకు తోడ్పడిన ఆనాటి నారాయణభట్టే యీనాటి నారాయణాచార్య వర్యునిగా జన్మించారా" అనిపించేలా చేసింది.

1954లో ముద్రింపబడిన 'ప్రబంధనాయికలు' గ్రంథానికి సువిఖ్యాత విమర్శకులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పీఠిక వ్రాస్తూ "కవిగా, విమర్శకుడిగా పెద్దయశస్సునకు స్వతంత్రముగా పునాది భద్రముగా వేసికొన్నవాడు. ఈయన గ్రంథములకు యితరుల ఉపోద్ఘాతమక్కరలేదు" అని అభిప్రాయపడ్డారంటే ఆశ్చర్యంలేదు. శర్మగారే అన్నట్టు "వణకులేని వాక్కు, స్వతంత్ర భావనాబలములేపుట్టపర్తివారికి పెట్టని ఆభరణాలు.

కాస్తంత హాస్యము, మరికాస్త వ్యంగ్య వైభవాన్ని కలిపి – అచ్చమైన తెలుగు సామెతల ఆమెతల తిరగమోతతో రచనల రుచిని పెంచే పుట్టపర్తివారి కలంపదును, ఆనాటి విద్యార్థిలోకం మొదలు పండితలోకం వరకూ అందరినీ వారికి దాసోహమనేలా చేసింది. ప్రాచీనకవులను విశ్లేషించే క్రమంలో సమకాలీన రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ, సామాజిక సందర్భాలూ, సమకాలీన కవులూ, విమర్శకులపై సంధించే వ్యాఖ్యలూ– అదనపు ఆకర్షణగా నిలిచేవి.

పుట్టపర్తి వారి విమర్శనాశైలికి తలమానికంగా నిలిచింది– "మహాభారత విమర్శనము" ఈ గ్రంథం చదివితే "వారెంత గొప్ప విద్వాంసులో, ఎంతటి మహాభావుకులో, యుగయుగాల భారతీయ పరమోజ్జ్వల సంస్కృతి భాష్యకారులో తెలుస్తుంది'' అంటారు– ప్రముఖ కథారచయిత– డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు.

విషయమేదైనా తలస్పర్శిగా చెప్పటం పుట్టపర్తి అలవాటు. 1939, 1942, 1955 సం॥లలో భారతి, పరిశోధనవంటి సాహిత్య పత్రికలలో వచ్చిన ప్రాకృత సాహిత్య విమర్శనా వ్యాసాలు చదివితే పుట్టపర్తివారికి గాథాసప్తశతి, సేతుబంధము, సావయధమ్మదుహా,



జసహరచరివు' వంటి మేటి ప్రాకృత రచనలతో వున్న లోతైన పరిచయం– ఆశ్చర్యపరుస్తుంది. ఈ వ్యాసాలే 2000 సం॥లో 'ప్రాకృత వ్యాసమంజరి'గా యీ వ్యాసరచయిత్రి ప్రకటించారు.

1955–1959 మధ్యకాలంలో, ద్రావిడ వాఙ్మయభారతి గురించి పుట్టపర్తి వ్యాసాలు, 'వ్యాసవల్మీకం'గా గ్రంథరూపం దాల్చాయి. (2007) మలయాళంలోని చంద్రోత్సవము (మణి ప్రవాళకావ్యం) తెలుగు కన్నడము పరస్పర సంబంధము, స్వాతి తిరుణాళ్ సంస్కృత కృతులు, కథకళి నాట్య పూర్వాపరాలూ వంటి అపురూప విశ్లేషణాత్మక వ్యాసాలు చదివితే– నూరుగ్రంథాలను పరిశీలించినట్టవుతుందని పరిశీలకుల అభిప్రాయం.

"విమర్శన అంటే ప్రతి విమర్శన యెప్పుడూ వుంటుందన్నమాట! ఉండవలెను గూడ! కనుక, ఇంతకూ తన విమర్శలతో విమర్శకుడు చేయగలిగినదంతా తనతోటివారికి ఒక సూక్ష్మదృష్టిని కలిగించి, వారిలో వున్న విమర్శనా దృష్టిని రెచ్చగొట్టటమే!" అన్న పుట్టపర్తివారి మాటలకు డా॥ జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రతిస్పందన – పుట్టపర్తి వ్యాసాలలో వైయక్తిక అభిమాన ద్వేషాలను వ్యక్తంచేసే విమర్శకాక, ఒక కవి దర్శనాన్ని, ఒక విమర్శక దర్శనం ఢీకొన్నట్టు దర్శనమిస్తుంది. అది విమర్శలో వేడిని, వాడిని సృష్టిస్తుంది."

'వాల్మీకి వాణి లలితమైనది. వ్యాసుని రచన చాల ప్రౌఢమైనది. భారతమున అనేక సమస్యలు. సమస్యలకన్న క్లిష్టమైనదాతని రచన. ఏదో నా శక్తి కొలది ఉపాసించినాను.' అని వినయంగా అనే పుట్టపర్తి యీ రచనకు ముందు భారత వివిధ ప్రతులను క్షుణ్ణంగా పరిశీలించారట! కొన్ని ప్రతుల్లో వస్త్రాపహరణ ఘట్టమే లేదట!! (ఏదో కూడా వారు ఉటంకించి ఉంటే బాగుండేదేమో కదా?? అన్న సందేహం వస్తుంది సహజంగా!! ఇక్కడిలా చూచాయగా అని వదిలేయటమే బాగుంది. ఈ ఆధారాన్ని పట్టుకుని విశ్లేషకులు కొంతమందైనా అటుకేసి అడుగులు వేస్తారని ఆచార్యులవారి మనోగతమేమో!!) 'మహాభారత యుద్ధానికి ప్రచోదక శక్తి ఐన యీ ఘట్టాన్నే కాదంటే, ఇక భారత యుద్ధాన్ని ఊహించడమెట్లా?? అని ఆచార్యులవారి ప్రశ్న.

వ్రాసిన చాలా కాలానికి అంటే, 1965 లో తొలి ముద్రణ పొందిన యీ గ్రంథంలో, ఆచార్యులవారి బహుభాషా పరిజ్ఞానం, విశ్లేషణానైపుణి అడుగడుగునా ద్యోతకమౌతాయి. పాశ్చాత్య వాఙ్మయంలో అతి పెద్ద గ్రంథాలుగా పరిగణింపబడే ఇలియడ్, ఒడిస్సీ కంటే, ఎనిమిదింతలు పెద్దదైన మహాభారతంలో ప్రతిబింబితమైన భారతీయ సంస్కృతినీ ధర్మాన్నీ విదేశీశక్తులు నాశనం చేసే ప్రయత్నాలెన్ని చేసినా, ఇందులోని శక్తే, మనలను కాపాడిందంటారు పుట్టపర్తి.

మహాభారత విమర్శనము గురించి సువిఖ్యాత కథకులు డా. అక్కిరాజు రమాపతి రావు గారి మాటల్లో..' మహాభారతానికి సంబంధించిన వివిధ విషయాల పరిశీలన, ఆచార్యులవారి యీ గ్రంధంలో అమితాశ్చర్యజనకంగా కనిపిస్తుంది. పాశ్చాత్య విమర్శకులు, తత్వవేత్తలు, మహాభారతాన్ని గురించి చేసిన అపవ్యాఖ్యానాలు, పడిన పొరపాట్లు, వెలిబుచ్చిన అసంగతాభిప్రాయాలు, ప్రస్తావించి, వాటికి మరి ప్రత్యామ్నాయం చేయలేని సమాధానాలు చెప్పారు ఆచార్యులవారు. భారతంలో పొందీ, పొసగనట్లు కనిపించే అంశాలను శ్రీ ఆచార్యులవారు, ఎంతో సమర్థంగా సమన్వయించారు. ఇక విదేశీయుల దురర్థకమైన వ్రాతలను ఖండించారు. భారతదేశంలో చిరకాల వ్యవస్థితమైనది, ప్రజాసత్తాకమేనని అత్యంతాహ్లాద కరమైన ఆధారాలతో, మహాభారతంలోని అనేక సన్నివేశాలను చూపుతూ నిరూపించారు ఆచార్యులవారు. అంతేకాదు. భారతీయ వ్యవస్థ పై పౌరజానపదులకున్న నియంత్రణను అద్భుతంగా అవిష్కరించారు. ఇటువంటి వ్యవస్థ అశొకుని కాలం వరకు అమలులో ఉన్నట్టు చారిత్రక ప్రమాణాలు చూపారు. ప్రజల సమ్మతితోనే పన్నులు పెంచవాలసిందే కానీ రాజు తనంత తానుగా అధికంగా పన్నులు వసూలు చేయకూడదటానికి నిదర్శనాలు భారతం శాంతి పర్వం ద్వారా వివరించారు.'

అంతే కాదు..' ఆధునికుల్లో కొందరు కౌరవులపట్ల అమిత ఔదార్యాన్ని ప్రదర్శించటం, ఆపద్ధర్మ సన్నివేశాలను దుర్మేధావిలసనంతో వ్యాఖ్యానించటం, పాండవులను దోషులుగా నిరూపించటానికి, ద్రావిడ ప్రాణాయామానికి పూనుకోవటాన్ని పుట్టపర్తి వారు నిర్ద్వంద్వంగా విస్పష్టంగా సూటిగా సరళంగా పరాస్తం చేశారంటారు కూడా!! ఇందులో ధృతరాష్ట్రుడి దౌష్ట్య విశ్లేషణ, కర్ణుని వైలక్షణ్య నిరూపణ, భీష్మద్రోణుల విశ్లేషణలు అద్భుతాలు, అవశ్య పఠనీయాలు.

'పుట్టపర్తి వారు, రెచ్చగొట్టే విమర్శ చేసేవారు. వారి విమర్శ, ఆలోచించే విస్ఫులింగాలను సహృదయులకందిస్తుంది. వారి విమర్శను ఆనందం కోసంకానీ, ఆహ్లాదం కోసం కానీ చదువుకోము. ఒక కొత్త చూపు కోసం వాటిని చదువుకుంటాము. నిద్రపోయే జాతిని మేల్కొలుపుతున్నట్టు విమర్శ చేయటం వారికే చెల్లింది..'అంటారు సుప్రసిద్ధ విమర్శకులు, తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ ఉప కులపతి, ఆచార్య జీ వీ సుబ్రహ్మణ్యం గారు. ఈ మాటలు అక్షర సత్యాలని నిరూపిస్తుందీ గ్రంథం.



'విజయనగర సామాజిక చరిత్ర ' అన్న చారిత్రక పరిశోధనాగ్రంథం, పుట్టపర్తికి విజయనగర చరిత్ర పట్ల ఉన్న మహోత్కృష్ట అభినివేశానికి తార్కాణం. ఎన్నెన్నో గ్రంధాలను పఠించి, పరిశీలించి, స్వయంగా ఆయా స్థలాలకు వెళ్ళి పరిశోధించి వ్రాసిన యీ గ్రంథం – విజయనగర నామకరణం నుండీ, సామ్రాజ్య స్థాపన, పరిపాలన, న్యాయ వ్యవస్థ, దండనాథులు, సైన్య సంపద – ఇవన్నింటి గురించిన సమగ్ర సమాచార సంకలనం.

1966 లో ముందుగా ప్రచురింపబడిన యీ గ్రంథం, అనేకానేక విమర్శకుల మన్ననలను అశేషంగా పొందింది. ఆతరువాత, ఆంధ్ర ప్రభ సచిత్ర వార పత్రికలో, విజయ నగర ఔన్నత్యాన్ని, మరపురాని మధుర గాధ గా కొనియాడుతూ, విద్యారణ్యులు, వ్యాసరాయలు, శృంగేరి వైభవం వంటి మరిన్ని చిరువ్యాసాలను అద్భుతంగా వెలయించారు ఆచార్యులవారు. వాటన్నింటితో విజయనగర సామాజిక చరిత్ర నూ కలిపి, 'మరపురాని మధురగాధ ' అన్న పేరుతో, 2009 లో యీ రచయిత్రి పున: ప్రచురించటం, ఆ గ్రంథం కూడా అనేకానేక ప్రశంసలకు పాత్రమవటం కూడా జరిగింది.

**వాగ్గేయకారునిగా పుట్టపర్తి**

అటు పటుతర గద్య పద్యోక్తుల జలధులను మధిస్తూనే యిటు మృదుమధుర పదరచనలను చేయగల సమర్థులు పుట్టపర్తివారు.

తన ఆధ్యాత్మికానుభూతిని 'ఆంధ్రజ్యోతి' (1990)తో పంచుకొంటూ – "నాకు ఇంట్లో సమస్యలు ఎప్పుడూ లేవు. ఇల్లు తీర్చిదిద్దుకోవడం నా భార్య కనకమ్మ చూసుకుంటూ ఉండేది. సాహిత్యంలో నన్ను ఒకళ్ళు పోటీకి రమ్మంటారని ఎప్పుడూ అనుకోలేదు. మరి ఏమిటి అశాంతి అంటే... నేను యువకుడుగా ఉన్నప్పుడే గాయత్రి 24 లక్షలు ఉపాసన చేశాను. ఆ రోజుల్లోనే కవిత్వవేది నారాయణరావుగారు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్‌గా పనిచేస్తుండేవారు. ఆయన పంచముఖీ ఉపాసన చేసిన సిద్ధ పురుషుడు. ఆయనను అడిగాను "తరువాత ఏం చేయాలి ఆధ్యాత్మికంగా" అని. "నారాయణం చెయ్యి" అన్నారు ఆయన. సరే "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరీ మంత్రం 16 కోట్ల సార్లు చేశాను. అటువంటప్పుడు నాకు ఆధ్యాత్మికానుభూతి కలగలేదేమో అని అశాంతితో బాధపడుతుండేవాణ్ణి" అన్నారాయన! (సరస్వతీ పుత్రునితో సంభాషణలు, పుట. 64)

ఒకానొక దశలో, హిమాలయాలకు వెళ్లటం– పుట్టపర్తి వారిలోని వైరాగ్య భావనలకు తెరతీసింది. తులసీదాస్, సూర్, కబీర్, తుకారామ్, జ్ఞానదేవ్ వంటి భక్తకవుల సాహిత్య

పరిచయంతోపాటు, వారి రచనల వంటి భక్తి సంకీర్తనలను వ్రాయటానికి ప్రేరణనిచ్చింది దత్త సంప్రదాయం. అనేకానేక అవధూతల ఉపాసనాక్రమం అవగతమవటం, వైష్ణవ ఆళ్వార్లు, కన్నడ, మలయాళ భక్తి రసవాహినిలో ఓలలాడటంయివన్నీ ముప్పిరిగొని, పుట్టపర్తిని ఏడువేల సంకీర్తనలు రచించేదాకా విశ్రమించనీయలేదు. నరనరానా అష్టాక్షరీనాథుడు నిండివున్నాడు. పండరినాథుని కీర్తించినా, చంద్రశేఖరుని ప్రస్తుతించినా, నరసింహునికి ప్రణుతించినా, చెన్నకేశవుని ఆరాధించినా, అష్టాక్షరీ పరంగానే రచనసాగింది.

ఈ అష్టాక్షరీ మకుట కీర్తనలలో, భజన సంప్రదాయం గురించీ, నామసంకీర్తనం గురించీ, తత్వబోధన గురించీ, సాధుజన సత్సంగం గురించి వర్ణించటమేకాక, మధురభక్తి, నిర్గుణభక్తి, నవవిధభక్తులు, వంటి వివిధ ప్రాధాన్యాలూ మనకు దర్శనమిస్తాయి. త్యాగరాజువలె సంగీత ప్రాశస్త్యాన్ని వర్ణించే రచనలూ ముగ్ధులను గావిస్తాయి. పెనుగొండలో బాల్యాన పక్కాహనుమంతాచార్యుల వారివద్ద ప్రారంభించిన అభ్యాసం. స్వయంకృషితో మరింతగా విస్తరించి మైసూర్ చౌడప్ప శిష్యుడు పెద్ద జమాలప్ప (ప్రొద్దుటూరు) సాంగత్యంలో మరింతలోతుగా దీటుగా నాటుకుపోయింది.

ముఖారి, పంతువరావళి, ధన్యాసి, మధ్యమావతి వంటి సుప్రసిద్ధ రాగాలలోనేకాక, ఛాయాతరంగిణి (చదువులనేమీ) కైకవశి (ధన్యులు గోపికలూ) హెజ్జుజ్జ (ఎవరినెడబాపితిరా) శివానంది (తెలియలేరూ, తెలివిలేకా నరులూ) సైంధవి (ఎన్నడు జూతునురా! ఇంక నిను) పుష్పలతిక (ఎవరూ శాశ్వతమూ) కల్యాణకేసరి (అదిగో జ్యోతి) మయూరధ్వని (కదిలించవయ్యా! పదముల యొల్లన) జలజవాసిని (అదిఏమి రూపమహా) నాగచూడామణి (భాగవతుల పూజా-పిమ్మట భగవంతుని పూజా) వంటి అపురూప రాగాలలో పుట్టపర్తివారు కీర్తనలు విరచించి, స్వయంగా గానం చేయటమేకాక, కొన్నింటికి స్వరవరుసలు (నొటేషన్) కూడా సమకూర్చి తదుపరి తరంలో వ్యాప్తి చెందేందుకై అవకాశం కల్పించారు కూడా!

'సూరదాస్'లోని వాత్సల్యభక్తి సైతం పుట్టపర్తి కలంలో పరవళ్లు త్రొక్కింది. "ఆడుకోరా కృష్ణా ఆడుకో'', ''ఆరగింతువుగాని రావోయి కృష్ణయ్య'', ''ఆడెనే గుమ్మడాడెనే'', "ప్రజానందుడదిగో" వంటి రచనలు యీ తరహా భావాలకు మచ్చుతునకలు. "శ్యామలతమాల వినీలం బాలం", "కరుణాజలధే! కస్తూరిరంగ", "పండరినాథా, పండరినాథా! అష్టాక్షరిమయ అఖిలాధారా", "కరుణాభవ పరిపూరితవరనయనా", వంటి సంస్కృత రచనలూ, పుట్టపర్తిని వాగ్గేయకారునిగా ముందు వరుసలో నిలబెడతాయి.



చిన్మయి రాగంలో 'ఎందున్నదే సుఖమూ..' మేఘరంజి రాగంలో 'ఎన్నాళ్ళు బ్రదికిన నేమీ..' కాపీనారాయణి రాగంలో 'గురుని గొల్వవే మనసా..' దేవ క్రియ రాగంలో'మనసా వాదము సేయకే..' సామంత రాగంలో 'ఏల భ్రాంతులగందువే..ఓ మనసా..' మోహన రాగంలో 'మనసా రాముని జూడవే..' మొదలైన కీర్తనల్లో త్యాగరాజు వలెనే ఆత్మశోధన పుష్కలం.

శివ సంకీర్తనలూ,, శ్రీకృష్ణ, శ్రీరామ, శ్రీరంగనాథ, పండరి విట్ఠల, హనుమ మొదలైన దేవతలందరి స్తుతీ మనసారా చేశాడీ అష్టాక్షరీభక్తుడు. అలాగే మేలుకొలుపులూ, జోలపాటలూ, తుమ్మెదనుద్దేశించిన రచనలూ కోకొల్లలు. విష్ణ్వాయుధాలైన పాంచజన్యము, సుదర్శనమూ మొదలైన ఆయుధాల సంబోధనలూ ఉన్నాయి. వైజయంతి, పీతాంబరాదులనూ కీర్తిస్తారు. స్వామిని నిరంతరమూ అంటిపెట్టుకుని వుండే భాగ్యం వాటిది మరి !!

'శ్రీరాధా దేవీ చింతిత ఫలదాయకి..' 'రాధాదేవీ రాస విహారిణి..'(మలహరి) 'రాసమేమున్నదీ రాధయె లేనిది..'(కామవర్ధని) వంటి కీర్తనల వల్ల రాధా మాధవ సంప్రదాయం కూడా పుట్టపర్తికి ప్రీతిపాత్రమని విదితమౌతుంది. రాసలీల వేళ రాధను బుజ్జగిస్తూ, మరో గోపికను చుంబిస్తూ, ఇంకొకతె యెదదాకి మాయచేస్తూ, అందరికీ అందరుగా కనిపిస్తూ, భ్రమింపజేస్తూ, యోగ మాయను దర్శింపజేస్తున్న అందరినీ అలరించిన ఆ లీలామానుషవేషధారిని ఆంధాళి రాగంలో మురిపెంగా కొనియాడుతారు.

రచనా ప్రయోజనం గురించి మమ్మటుడు, కావ్యప్రకాశంలో ఎంతో స్పష్టంగా చెప్పినట్టు, యశస్సు కొరకు, ధన సంపాదనకొరకూ, లోక వ్యవహార జ్ఞానం కొరకూ అన్న మొదటి మూడు ప్రయోజనాలవైపు చూడక, అమంగళ పరిహరణకోసం, సద్య:పరనివృత్తి (విశ్వశ్రేయస్సు) లాలించి, బుజ్జగించి, ప్రీతిపూర్వకంగా చెప్పటానికే పెద్ద పీట వేయటం, సమాజం పట్ల నిబద్ధత ఉన్న సాహిత్యకారుల లక్ష్యం. వ్యాస, వాల్మీకాదులు ఏర్పరచిన యీ రాచబాటలో అనేకానేక కవులూ, రచయితలూ, తరతరాలుగా నడుస్తూనే ఉన్నారు. తమదైన కోణం నుంచీ సమాజాన్ని విశ్లేషిస్తూ, హితవు పలుకుతూనే ఉన్నారు. పదునాల్గు భాషాపాండితితో సరస్వతీపుత్రునిగా కీర్తింపబడినా, ఆ అహంతను ఆవల పెట్టి, అతి సామాన్యుని వలె, జీవి అంతరంగాన్ని ఆ అజేయ, అమేయ జగన్నాయకునికి నివేదించి, బైటపడే మార్గాన్ని నిర్దేశించమని యీ కీర్తనల ద్వారా దీనంగా వేడుకుంటున్నారు పుట్టపర్తి. ('ఖరహరప్రియ' రాగంలోని నాకేటి బిరుదులో అన్న కీర్తన).

మానసికపూజే పరమాత్మకు ప్రీతికరమనీ, 'ప్రేమమయ జపమాలలో మధురమైన ఆ నామమును నిరతమూ నియమబద్ధంగా" జపిస్తే భక్తుడే పరమాత్మగా మారినా ఆశ్చర్యంలేదనీ "నీవనుచు నీవైతినీ – పరమాత్మ, నినుజూచి నీవైతినీ" అన్న రచనలో భ్రమరకీటక న్యాయాన్ని ఆవిష్కరించిన పుట్టపర్తి చివరిమాటలు– "భగవంతుడూ – భాగవతమూ – భక్తుడూ ఒకటే" కావటం– కాకతాళీయం కాదు.

**అనువాదకునిగా పుట్టపర్తి**

మనకు తెలియని భాషలోని సాహిత్యాన్ని ఆకళింపు చేసుకోవటానికి అనువాదాలే– సమర్ధవంతమైన ఆధారాలు. బైబిల్ నుండి మన భారత భాగవత రామాయణాల వరకూ అనువాదాల ద్వారానే సామాన్య ప్రజానీకానికి దగ్గరయ్యాయనేది లోకవిదితం. ప్రాచీనకాలంలో– భగవత్ తత్త్వాన్ని గురించిన సులభమార్గాలు, సామాన్య ప్రజానీకానికి అందుబాటులోకి వస్తే తమ ప్రాబల్యం తగ్గిపోతుందేమోనని, అనువాదకులని కఠినంగా శిక్షించిన కథలు బోలెడు పాశ్చాత్య చరిత్రలో వినిపిస్తున్నాయి. ఐనా సత్యాన్ని దాచటం, సూర్యుని తేజస్సును దాచటం వంటి హాస్యాస్పదమైన చర్య. అందుకే సత్యమూ, నిత్యమూ అయిన భగవత్తత్వం. వెలుగులోకి వచ్చింది. పరమాత్మతత్వ మాధురిని పదుగురుకీ పంచింది.

Webstars dictionary ప్రకారం "Translation is an art that involves the recreation of work in another language for readers with a different background." ఒక భాషకు చెందిన నేపధ్యమున్న రచనను, మరోనేపధ్యమున్న భాషీయులకోసం పునసృష్టి చేయటమే అనువాదమట!

పుట్టపర్తివారు పదునాల్గు భాషలతో ప్రగాఢ పరిచయం వున్నవారు. ఏడెనిమిది భాషలలో రచనలు చేయగల్గినవారు, ఈనాడు పలుభాషలు నేర్చేందుకు సులభమార్గాలు బోలెడన్ని. కానీ పుట్టపర్తి కాలంలో యితర బాషలను నేర్చేందుకు తగిన సదుపాయాలూ, సామగ్రి అంతంతమాత్రాలు. కేవలం స్వయంకృషి, విపరీతమైన పట్టుదలతోనే సంస్కృతం, కన్నడ, మలయాళ, తమిళ, మరాఠీ, బెంగాలీ, ఉర్దూ, ఆంగ్లం వంటి భాషలను 'పారముముట్టెదుదాక' నేర్వటమేకాక, మాగధి, అర్ధమాగధి, పైశాచీ, శౌరసేనీ, పాలీ వంటి ప్రాకృత భాషారూపాలు, ఖడీబోలీ, బ్రజ్, అవధ్ వంటి హిందీ భాషామూలాలేకాక, రష్యన్, గ్రీక్ లాటిన్ వంటి పాశ్చాత్య భాషలనూ అవగతం చేసుకునే ప్రావీణ్యం సంపాదించటం – తన వివిధ భాషాపరిజ్ఞాన కౌశలాన్ని అనువాదాలద్వారా, ప్రసంగ వ్యాసాలద్వారా



ప్రకటించగల్గటం. మన సమీపకాలంలో ఒక్క పుట్టపర్తికి మాత్రమే సాధ్యమైన అద్భుత సాహిత్య విన్యాసం. వారి స్వతంత్ర రచనలలోనూ యీ పాండితీ పరిపాకం ప్రతిఫలిస్తూనే వుంటుంది.

మార్క్సు ప్రభావం వల్ల రష్యన్ భాషను నేర్చారు. ప్రాచీన భాషా సాహిత్యాల పట్ల ఆకర్షణవల్ల గ్రీక్, లాటిన్లను అభ్యసించారు. తమ 70వ యేటా– ఉర్దూను స్వతంత్రంగా రాయటానికీ శ్రీకారం చుట్టారు. ఇప్పుడిక తమతల్లి 'సరస్వతి' సరసన కూర్చుని ఏ భాషను అభ్యసిస్తున్నారో ఆ సరస్వతీ పుత్రులు!

అనువాదానికి పుట్టపర్తి వారు ఎంపిక చేసుకున్న గ్రంధాలన్నీ అపురూపమైనవీ, విలక్షణమైనవీ, వివిధ భాషాసాహిత్యలలోని భారతీయాత్మను తెలుగువారికి పరిచయం చేసేవే!!

బుద్ధభగవానుని సమకాలీన సామాజిక, ధార్మిక, రాజకీయ పరిస్థితులను ఋషితుల్యులు ధర్మానంద కోశాంబి గారు మరాఠీలో బహు విస్తృతంగా చర్చించగా, ఆగ్రంధాన్ని 'బుద్ధ భగవానుడు' అన్న పేరుతో పుట్టపర్తివారు, తెలుగీకరించారు. కన్నడ సాహిత్యంలో బీచి గారు బహుళ జనాదరణ పొందిన రచయిత. బీచి అసమాన శైలికి మరింత మెరుగులు పెట్టి తెలుగు పాఠకుల పైకి సంధించిన పుట్టపర్తి లేఖిని మెటికలు(తాపలు) మంపరలు (మరులు) జోము (తిమ్మిరి) ఓళిగలు(బొబ్బట్లు) ఉప్పిండి(ఉప్మా) కిర్లుకొను (ఉలిక్కిపడు) వంటి రాయలసీమ మాండలిక పదాలనుకూడా 'సరస్వతీసంహారము' అన్న పేరుతో తాను తెనిగించిన నవలలో తన పాఠకులకు రుచి చూపించింది. ఇంకా ముస్లిం పాలనలో భాషలో ఆదాన ప్రదానాల రూపంలో చొరబడి భాషలో కలిసిపోయిన తకరారు, పజీతు, పురసత్తు, లగాము వంటి ఉరుదూ పదాలనూ అక్కున చేర్చుకుంది. సమర్ధవంతంగా సాగిన యీ నవలానువాదం, పుట్టపర్తిపై ప్రశంసల వర్షం కురిపించింది.(జూన్ 1959, స్రవంతి సంచికలో సమీక్షకుడు స్రి అరుణ్) 'తీరని బాకీ' , మళయాళ నాటికల సమాహారం. తిరువాంకూరులో పుట్టపర్తివారు ఉద్యోగం చేస్తున్నప్పుడు, (1954–56) మలయాళ భాషపై మంచి పట్టు సాధించారు. కథాకళి సాహిత్యం, స్వాతీ తిరుణాళ్ రచనలూ వంటి ఎన్నో విషయాలపై చక్కటి విశ్లేషణాత్మకమైన వ్యాసాలు వ్రాయటమే కాదు. విశ్వనాధ 'ఏకవీర ' నవల ను అప్పుడక్కడ గవర్నర్ గా ఉన్న డా.బూర్గుల రామకృష్ణారావుగారి మాట మేరకు మళయాళం లోకి అనువదించగా, ఆ అనువాదం, అప్పట్లో ఇంటర్ మీడిఎట్ లో పాఠ్య

గ్రంథంగా నిర్దేశించబడిందట కూడా!! ఒక అనువాద నవలను విశ్వవిద్యాలయం పాఠ్య గ్రంథంగా స్వీకరించటమంటే, ఆ అనువాద ప్రమాణాలు, ప్రశంసనీయంగా ఉన్నాయనటంలో సందేహమేమాత్రమూ లేదు కదా!! ఆ విధంగా పుట్టపర్తి అనువాద స్థాయిని మనం అంచనా వేయవచ్చును. 'తీరని బాకీ' అన్న మళయాళ నాటక సంకలనం లోనూ బహు చక్కని వ్యావహారిక భాష, సునిశిత హాస్యం, ఇది అనువాదమన్న స్పృహ కలిగించక, తెలుగు నాటకాలేనన్న విధంగా అలరిస్తాయనటంలో సందేహం ఏమాత్రమూ లేదు.

సంస్కృతంలో భాసుని 'చారుదత్తము' అన్న నాటకాన్ని భావసుందరంగా అనువదించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు, పాఠ్య పుస్తకంగా యీ అనువాదాన్ని స్వీకరించదలచి, ఏవో కొన్ని సాంకేతిక కారణాలవల్ల సువిఖ్యాత సంస్కృతాంధ్ర పండితుడు శ్రీ జమ్మలమడక మాధవరాయ శర్మ గారి పేరును కూడ సహ అనువాదకునిగా చేర్చి ప్రకటించవలసి వచ్చిందనీ, కానీ మాధవరాయ శర్మగారు యీ అనువాదంలో పాలుపంచుకోనేలేదని పుట్టపర్తి వారే డా.ఆమళ్ళదిన్నె వేంకట రమణ ప్రసాద్ గారికి వ్రాసిన లేఖలో పేర్కొన్నారట!! (తెలుగు సాహిత్యం లో మృచ్ఛకటికము – పరిశోధనాగ్రంథం, 326వ పుట) ఈ యాఖ్యను బలపరిచే విధంగా, యీ అనువాదంలో, తిరగవాత, దక్షిణదుడ్లు, నడవ వంటి రాయలసీమ పదాలు చాలా ఉన్నాయన్నారు డా.ఆమళ్ళదిన్నగారు కూడా!!మూల కర్త శక్తినంతా అనువాదకుడు, తన భాషలోనికి రాబట్టటానికి చేసిన ఉత్తమ ప్రయత్నంగా కూడా కీర్తించారు కూడా!!

హిందీ సాహిత్యంలో నిర్గుణోపాసక కవుల్లో కబీరు దాసునిది ప్రత్యేక స్థానం. సాలెవాడైన నీరూ పెంపుడు కుమారునిగా అతని వద్ద నాథ సంప్రదాయ రీతులు, ఇస్లాము మతవిశ్వాసాల మధ్య పెరిగిన వాడైనా, స్వామీ రామానంద తీర్థులవారి శిష్యరికంలో బాహ్యాచారాలకన్నా ఆంతరంగిక శుద్ధే ముఖ్యమంటాడు.హజారీ ప్రసాద్ ద్వివేదీ గారి విపుల పీఠికతో పండిత్ అయోధ్యాసిం హ్ ఉపాధ్యాయ్ గారి సంకలించిన యీ గ్రంథాన్ని కేంద్ర సాహిత్య అకాడెమీ వారి ఆదేశం మేరకు, తేటవచన రూపంలో అనువాదం చేశారు పుట్టపర్తి వారు. నాలుగు మార్లు పునర్ముద్రింపబడటమే యీ అనువాద గ్రంథ ప్రమాణాలను ఋజువు చేస్తున్నది యీ 'కబీరు వచనావళి ' గ్రంథం.

'స్వర్ణపత్రములు', వీరసావర్కార్ మరాఠీ రచనానువాదం. 'భారతీయ ఇతిహాసాంచల్ సోనేరీ పన్నే' అన్న మూల రచన, శక, హూణాది,విదేశీ దురాక్రమణదారులందరినీ తరిమికొట్టి



భరత జాతిని రక్షించిన చంద్రగుప్తం విక్రమాదిత్య వంటి భారతీయ వీరుల విజయ గాథల సమాహారం. అప్పటి ప్రముఖ చారిత్రక పరిశోధకులు, ఆర్కియాలజీ డిపార్ట్మెంట్ అధిపతి డా.పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారి విస్తృత పీఠిక అదనపు ఆకర్షణగా, పుట్టపర్తి అనువాదం, మూలగ్రంథాన్ని మించి, తెలుగు పాఠకులకు దగ్గరైందట!!

ఉరుదూలో హమ్రాజ్ రహబ్బర్ రచించిన ఒక నవలను 'సంఘర్షణ' పేరుతో అనువదించగా, 1970 ప్రాంతాలలో ప్రచురితమైంది కూడా!! దురదృష్టవశాత్తూ ఆఅనువాద ప్రతి అలభ్యం. అది కూడా లభించి ఉంటే, పుట్టపర్తి అనువాద రచనల్లో మరో జాతి రత్నంగా భాసిల్లేది.

**వివిధ సందర్భాలలో పుట్టపర్తి చాటువులు**

సరస్వతీపుత్రునిగా దేశవ్యాప్త గౌరవాన్ని అందుకున్న చతుర్దశ భాషా విహారి, పుట్టపర్తి నారాయణాచార్యులవారు. వారి పేరు వినగానే, 'ఏమానందము భూమీతలమున..' అన్న వారి శివతాండవ రచననే గుర్తుచేసుకుంటారు – తెలుగు సాహిత్యాభిమానులందరూ!! మేఘదూతము, షాజీ, సిపాయి పితూరీ, జనప్రియ రామాయణం ..ఇలా కవ్యాల సంఖ్యా పెద్దదే!! విమర్శ విషయానికి వస్తే, ప్రబంధ నాయికలు, రామకృష్ణుని రచనావైఖరి, వసుచరిత్ర సాహితీసౌరభము, మహాభారత విమర్శనము వంటి రచనలు వరి పండితీ వైదగ్ధ్యానికి పరాకాష్ఠగా దర్శనమిస్తాయి.ప్రతీకారము, అభయప్రదానము, హరిదాసి వంటి చారిత్రక నవలలతో పుట్టపర్తివారు, నవలారచనలోనూ తన బావుటాను ఎగురవేశారు. ఇతర భాషలనుండీ మేలైన రీతిలో వారు అనువదించిన భగవాన్ బుద్ధ(మరాఠీ నుండీ తెలుగులోకి) స్వర్ణరేఖలు(మరాఠీనుండి) తీరని బాకీ(మళయాళం నుండి) కబీరువచనావళి (హిందీ నుండి) సరస్వతీసమ్మారము (కన్నడం నుండీ)వంటి రచనలు, పుట్టపర్తివారి అన్య భాషా పటిమకు తార్కాణాలు.అష్టాక్షరీ నథునికి అర్పిస్తూ వారు వ్రాసిన వేలకు మించిన భక్తి రచనలు, వాగ్గేయకారునిగా వారి స్థాయిని, ఒక త్యాగయ్యతోనో, ఒక రామదాసుతోనో పోల్చి చూసుకుని తృప్తి చెందేలా చేసేవే!!

నలభై ఏళ్ళ వయస్సులో, జీవితం పై విరక్తితో హిమలయాల్లో ఆత్మహత్య కోసం ప్రయత్నిస్తుండగా, శివోపాసకులు శివానందమూర్తిగారి కంటబడిన పుట్టపర్తివారు, అత్మహత్యా ప్రయత్నం మాట అటుంచి, సరస్వతీపుత్ర బిరుదుతో కడపకు వెనుదిరిగి, అటు తరువాత శతాధిక రచనలతో, తెలుగు సాహిత్యాభిమానులను ఉక్కిరి బిక్కిరి చేయటం మరో ఉద్విగ్నపూరిత వృత్తాంతం!!

పద్య, గద్య, గేయ, అనువాద, విమర్శనా రంగాల్లో అసంఖ్యాక రచనలతో పాటూ సంస్కృతాంగ్ల రచనలు కూడా చేసిన ఏకైక సరస్వతీ పుత్రులవారు వివిధ సందర్భాలలో ఆశువుగా చెప్పిన పద్యాలలోనూ, రస స్ఫూర్తి మెండుగా చిప్పిల్లటం, వారి సద్యఃస్ఫూర్తికి తార్కాణాలే!! గ్రంథస్థము కాకున్నా, లోకంలో ప్రజాదరణ పొందిన పద్యములను చాటు పద్యములు అంటారంటుంది శబ్ద కోశం. పుట్టపర్తివారలా ఆశువులుగా చెప్పినా, వారి అభిమానులకు అత్యంత ప్రీతిపాత్రమైన కొన్ని చాటువులివిగో!!

1955 లో ధవళేశ్వరం ప్రాజెక్ట్ మిత్రులతో సందర్శించిన వేళ. యీ పద్యాలు ఆశువులుగా వెలువడ్డాయట!!

మ. 'అల రామయ్య పదంబులే గడిగెనో, యా వహ్ని సంపూత మై
థిలి నెమ్మోమరవంచి తుడుచుకొనెనో, తేజస్సమాయుక్త మాం
సలితాంసమ్ముల మైల దీసికొనెనో మా లక్ష్మణ స్వామి బ
ల్కుల యొయ్యారివి, నిల్చి బల్కగదవే? గోదావరీ హ్రాదినీ!!

తుంగభద్ర నీటి మాధుర్యాన్ని కడుపార మరగిన పుట్టపర్తివారు, విజయనగరాధీశుల ఆచార్యవర్యులైన తిరుమల తాతాచార్యుల వారి వంశ సంభవులు కూడా!! గండికోట (కడప జిల్లా) వడహల వైష్ణవులైన పుట్టపర్తివారికి తుంగభద్ర, పెన్నలు, ప్రాణ సమానాలవటంలో ఆశ్చర్యం లేదు కదా!! విజయనగర సామ్రాజ్య వైభవాన్నీ పుట్టపర్తి వారి మాటల్లో విని తీరవలసిందేనని అప్పటి సాహిత్యాభిమానుల నిశ్చితాభిప్రాయం. ఈ నేపథ్యంలో, తుంగభద్ర, గోదావరీ నదుల సాపత్యాన్ని పుట్టపర్తి వారి మాటల్లోనే ఇలా విని తీరవలసిందే!!

శా. హేరాళంబిదె నాదు భాగ్యమని నీవెంతెంతొ ఘోషింతు, నీ
వారిన్ జూచితిలెమ్ము జెప్పకుము గొప్పల్ విప్పుగా గౌతమీ,
ధారావర్ధిత గోస్తనీ రస సముద్యత్తుంగ భద్రానదీ
స్వారస్యంబుల ముందు తావక పయఃపనమ్ము శోభించునా?

తే. సార సంగీతమునకు కావేరి నీరు,
అరిది కవితకు తుంగ భద్రమ్మ నీరు,
యెన్న బూనిన మరియు మా పెన్న నీరు,
నీవి పైపైని రుచులు గోదావరమ్మ!!



ఓ చోటికి పుట్టపర్తి దంపతులు బస్సులో వెళ్తున్నారు. ఇద్దరు కూర్చోవలసిన సీటులో లావుపాటావిడ ఒక్కతే ఆసీనురాలై ఉంది. ఆవిడను అడిగితే, చిరాకుగా కదిలి, కాస్తంత చోటిచ్చింది. అందులో పుట్టపర్తిగారి శ్రీమతి, కనకమ్మగారెలాగో సర్దుకుని కూర్చున్నారట!! ఆ లావుపాటి స్త్రీ గురించి యీ ఆశువుగా చెప్పిన పద్యమిది.

కం. గజ గమన గాదు ఇయ్యది,
గజ సదృశ శరీర, సీటుకంతయు దానై,
అజగరమై కూర్చున్నది,
గజి బిజి యైపోయె మనసు, కన్నులు గూడన్.

ఏదో ఊరికి వెళ్ళినప్పుడెదురైన వయ్యారిని గురించి పుట్టపర్తి వారి స్పందన.

తే. అడ్డమాకయు లేనట్టు లాక్రమించు,
నెదురు గుబ్బలదాన,గెంబెద విదాన,
పట్టపగ్గాలు లేని యవ్వనము తోడ
యెవని భాగ్యము బండజేతువె శుభాంగి?

అనంతపురం జిల్లా, ప్యాపిలి గ్రామానికి ఘన సన్మానానికి వెళ్ళినప్పుడు పుట్టపర్తి కొక సుందరాంగి కడవలో నీళ్ళు పట్టుకుని వెళుతూ ఎదురైంది. అప్పుడీ పద్యం రసస్ఫోరకంగా వెలువడింది.

కం. నడుమున్నదియో లేదో,
కడవా బ్రహ్మాండమంత, కామ హయములీ
అడకువ లేని కుచంబులు
ఇడుముల పడకుండనెట్లు, ఇలు సేరెదవే??

అందమే అనందం కదా ఎవరికైనా? కవుల దృష్టిలో అందం, మరింత మనోహరంగా కవితారూపం దాలుస్తుంది మరి ఇలాగే!!

రాజమహేంద్రవరంలో ఒక చాకిరేవులో తాను చూసిన చెంచిత గురించినదీ చాటువు.

సీ. కుదురు నిండినయట్టి గుబ్బ చన్నులయందు
హారముల్ తొక్కిళ్ళు యాడుచుండ,

నీలోత్పలములతో మేలమాడెడు నిండు
చూపులు విటగాంధ్ర సొగియజేయ,
యౌవ్వనోద్రేక సాహంకర జఘన
చక్రమ్ముతో నిరుపేద కౌను కదల
మద బర్హిరాపించమై వీగు క్రొవ్వెద
కురులు నెమ్మోముపై గునిసియాడ,

తే. తమ్ములపు కాంతి సోకి రక్తమ్ములైన
పండ్లు పగడాల దస్తరి పట్టుచుండ,
గాజులెలుగివ్వ గౌతమి గట్టునందు,
నుతుకుచున్నది వలువ చాకిత యొకర్తు.

రాజమహేంద్రవం యాత్రలోనే ప్రాత:కాలాన ఎదురైన పాలపడుచు పై చెప్పిన చాటువు

శా. ప్రాలంభ ప్రవిభాసి హేమమయ హారంబుల్ విభాళింపగా,
మేలౌ గుబ్బల పైని యౌవ్వనము కల్మిన్ బెంపు దీపించునో
లీలా హంసిని !! అచ్చ వెన్నెలల వెల్లిన్ దున్మి తూటాడు నీ
పాలన్ బోతువు గాని కన్నుగవ క్రేవల్ విప్పి వీక్షింపవే??

రాజమహేంద్రవర యాత్రలో ప్రాతఃకాలాన ఎదురైన పాలపడుచుపై చెప్పిన చాటువు

యువ పుట్టపర్తి లబ్ధ ప్రతిష్ఠుడైన ఒక కవిగారిని కలుసుకున్నారు. ఆ కవి కంటికి యీ తరుణవయస్కుడైన సారస్వతమూర్తి ఆనలేదు. అతని నిరాదరణను గమనించిన, పుట్టపర్తిలో కట్టలు తెంచుకున్న ఆవేశం యీ చాటువైంది.

మ. కవివన్నన్ నిను జూడ వచ్చితిమి, సఖ్యంబిచ్చి వీద్యంబులి
చ్చి వినోదంబుల నొల్కబోతువని, రాసిక్యంబు నీ యొంటికన్
టి విలాసంబుల జూడ వచ్చితిమొ? ధాటీతోటితాశేష స
త్కవి, నీవేమని ఎంచుకొంటివిర?? గ్రద్దా!! తోకనాడింతువా??

ఈ సాహితీ విస్ఫులింగం చాటువుకు ఆ అహంకార కవి సమాధానం ఏమైఉండనోపు??



సంస్కృతంధ్రాలలో తన ప్రవేశమేమాత్రమని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రశ్నించగా, అప్పటికప్పుడు వారిముందు ఆశువుగా చెప్పిన సంస్కృత శ్లోకం.

శ్రీమత్ సంతు సృష్టి స్థితి లయ రసవత్ కావ్యధారా ప్రమీలత్
ధ్వన్య ధ్వన్య ధ్వనినా: కహకహనినదాపాదితాప్యాయి వేదా:
సాకూత సార గౌరీ నయన చుళికితా: శేఖరశ్చంద్ర చాంద్రీ
ప్రేయాంస: పుణ్య రూపా: కబళిత కహు బహ బహ: శాంభవా:

ఇంత చిక్కటి సంస్కృత కవిత్వాన్ని ఆశువుగా చెప్పిన పుట్టపర్తివారిని, సమదర్శియైన శ్రీపాదవారు, అక్కున చేర్చుకున్నారట!!

పుట్టపర్తివారెప్పుడూ అంటుండేవారు..'నన్ను కవిగా మెచ్చకపోయినా నేను బాధపడను. కానీ పండితుణ్ణి కాదంటే మాత్రం, నాకు చాలా కోపం వస్తుంది..' అని!! కుదురుగా కూర్చుని, కలం పట్టి వ్రాసే కవిత్వంలోనూ, అలవోకగా ఆశువుగా చెప్పే కవిత్వంలోనూ ఒకే విధమైన చిక్కనైన చక్కదనం సాక్షాత్కరించటం, పుట్టపర్తి వంటి సరస్వతీపుత్రునికి మాత్రమే సాధమనిపించదూ మరి!!

**ఇతరములు**

గద్య, పద్య, అనువాద, గేయ రచనలేకాక- గుణపరిపాకానికే ప్రాధాన్యతనిస్తూ ప్రాచీన సాహిత్యం మొదలు, ఆధునిక ప్రక్రియల వరకూ అనేకానేక రచనలకు అపురూపమైన పీఠికలు పుట్టపర్తివారు వెలార్చారు.

రాజశేఖర చరిత్ర (1967) శ్రీమదాంధ్ర మహాభారతము (అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వాలు 1974) వరాహపురాణం (1978) భామినీవిలాసము (1980) వంటి ప్రాచీన సాహిత్యాలకు విలువైన, విపులమైన పీఠికలను ఆచార్యులవారు సంతరించారు.

అలాగే కేనోపనిషత్తు (శ్రీ భూమానంద భారతి) దక్షిణానిలము (వై.సి.వి.రెడ్డి) స్వప్న శీతాచలము (భైరవకొండారెడ్డి) ఋతుఘోష (గుంటూరు శేషేంద్రశర్మ) వేసవి-వెన్నెల (ఆరుద్ర), తొలకరి చినుకులు (వై.సి.వి.రెడ్డి), శ్రీవేమయోగీయమ్ (కడివేటి నరసారెడ్డి), శ్రీమదొంటిమిట్ట కోదండరామాలయ దివ్య చరితము (రామావఝుల వేంకటేశ్వర్లు), గురువీలామృతము (ఇసుకపల్లి సంజీవశర్మ), సౌందర్యలహరి (రావినూతల శ్రీనాధరావు), శ్రీమద్రామాయణ

దర్శనం (పుల్లెల శ్రీరామచంద్రుడు), జానపద పారమార్థిక గేయ సాహిత్యం(ఎర్ల బాలకృష్ణారెడ్డి) రమణీయ రామాయణము (దుగ్గిశెట్టి వేంకటరమణయ్య) వంటి రచనలకు కూడా సహృదయ సుందర పీఠికలను ఆచార్యులవారు వెలయించారు. ఈ వ్యాసకర్తకు అందుబాటుకురాని పీఠికలు మరెన్ని వున్నాయో!

గుంటూరునుంచి సుప్రసిద్ధ రచయిత్రి 'లత'గారి సంపాదకత్వంలో 'లత' అన్న మాసపత్రిక 1967లలో వస్తుండేది. అందులో "జీవితం– అనుభవాలు" అన్న స్వీయచరిత్రను పుట్టపర్తివారు కొన్ని నెలలపాటు ధారావాహికంగా వ్రాశారు. ఆచార్యులవారి బాల్యం నాటి సామాజిక, సాంస్కృతిక, రాజకీయ నేపథ్యంతోపాటు, వారు దర్శించిన అసామాన్యులు, సామాన్యులైనా మాన్యులు, యిలాంటి అనేక విషయాలతోపాటు వారిని ప్రభావితం చేసిన ప్రతిభామూర్తులు, విస్మయపరచిన విశిష్ట వ్యక్తుల వింతధోరణులు. యిలాంటి ఎన్నో విశేషాలనందించిన యీ ధారావాహిక పత్రికలాగే అర్థాంతరంగా ఆగిపోయింది.

1985లో 'రాళ్లుగా మారిన రాయలసీమ రతనాలు' అన్న శీర్షికతో 'ఆంధ్రప్రభ' దినపత్రికలో ధారావాహికంగా వచ్చిన కొన్ని వ్యాసాలలో ప్రజలకోసం కళలను కళలకోసం జీవితాలనూ అంకితమొనర్చినా, ప్రభుత్వ ఆదరణనూ, జీవికలను తగుమాత్రంగానైనా నడిపే ఆదాయాలనూ పొందని ప్రతిభామూర్తుల వ్యథాభరిత గాథలున్నాయి.

1982 జులై నుండి 1983 మార్చి వరకూ 'ఆంధ్రజ్యోతి' సచిత్ర వారపత్రికలో "పద్యంబొక్కటి చెప్పి" శీర్షికన, ఆచార్యులవారు, తమకు నచ్చిన కొన్ని అపురూపమైన పద్యాలకు, అబ్బురపరచే వ్యాఖ్యలను వెలార్చారు.

దాదాపు జీవిత చరమాంకంలో తిరుమల తిరుపతి దేవస్థానం ఆదేశం మేరకు శ్రీమద్భాగవతానికి వ్యాఖ్య వ్రాయబూనారు వారు.

అద్వైత విశిష్టాద్వైత, ద్వైత సంప్రదాయ వ్యాఖ్యలతోపాటు, జీవగోస్వామి, మధుసూదన సరస్వతి, విశ్వనాథ చక్రవర్తి, తర్కవాచస్పతి గోస్వామి, పురుషోత్తమ చరణగిరినాథుడు యిలా యెందరెందరో ఇదివరకు భాగవతానికి వ్యాఖ్యలు వ్రాశారు. ఎవరేమి వ్రాసినా, దాన్ని పూర్వపక్షం చేసే వ్యాఖ్యలు వెనువెంటనే బయలుదేరేవి. అందుకే "విద్యావతాం భాగవతే పరీక్షా" అన్న నానుడి పండిత వర్గాలలో దడపుట్టించేది. ఇంతటి నేపథ్యంవున్న భాగవతాన్ని ఆచార్యులవారు వ్యాఖ్య వ్రాయబూనటం– తమనుతాము యీ పరీక్షకు సన్నద్ధులను చేసుకోవటమే నన్నమాట!



తర్కములకు తావివ్వక, శ్రీధరవ్యాఖ్యతో మొదలై వంశీధరుడు, బుక్ పరిశిష్ఠ వాఖ్య, వీరరాఘవ, జీవగోస్వామి, శుకదేవ, వల్లభాచార్య, గిరి, విజయధ్వజ వ్యాఖ్యలమీదుగా చివరికి పోతనను తలచి, దానికి తాత్పర్యం – యిదీ పద్ధతి. అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతముల మూలసిద్ధాంతాలను క్రోడీకరించి, వ్యాసహృదయమునకు క్షితి కలుగకుండా ఆచార్యులవారు సాయించిన యింతటి మహోదాత్తమైన వ్యాఖ్య మరొకటి యింతవరకూ లేదని పండితలోకం కీర్తిస్తున్నది. భాగవతంలోని ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధాలవరకు మాత్రమే ఆచార్యులవారు వ్యాఖ్యను సమకూర్చగలిగారు. కారణం – మొదటినుంచీ వారికి అచ్చమైన సహధర్మచారిణిగా, 'వాగర్థావివసంపృక్తౌ' వలె, అటు కుటుంబజీవనంలోనూ, యిటు సాహిత్య వ్యవసాయంలోనూ, నూటికి నూరుపాళ్లూ వెంటనడిచిన అర్థాంగి కుం.సౌ. కనకమ్మగారే ఆచార్యుల వారికి లిపికారిణి, కావ్యరచన తప్ప తక్కిన అన్ని రచనలూ పుట్టపర్తివారు చెబుతూ వుంటే (డిక్టేట్) ఆ చల్లనితల్లి– వ్రాస్తూవుండేవారు. వీటికి చిత్తుప్రతీ– అటుతరువాత ఆచార్యులవారు తప్పొప్పుల దిద్దుబాటు తరువాత శుద్ధప్రతీ– ఆమే తయారుచేసేవారు. ('అగ్నివీణ', 'గాంధీజీమహాప్రస్థానం'లను ఆచార్యులతో పాటూ కనకమ్మగారూ రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఉత్తమ రచయిత్రి సన్మానాన్ని అందుకున్నారుకూడా) 1980లలో మొదలైన యీ వ్యాఖ్యారచన, కనకమ్మగారి తీవ్ర అనారోగ్యం, అటుతరువాత 1983 మార్చిలో హఠాన్మరణంవల్ల బాగా కుంటుపడింది. సరైన లిపికారులు దొరకక, ఆ అడపాదడపా వ్రాతలకు సహాయపడే కుమార్తెలు, కరుణ, తులజ, నాగపద్మిని, అనూరాధలకు పెళ్లిళ్లై అత్తవారింటికి ఆజ్ఞాబద్ధులవటం వల్ల తన అనారోగ్యంవల్ల మరికాస్త ఆచార్యులవారు యీ వ్యాఖ్యను కొనసాగించలేకపోయారు. మూడవ ఆశ్వాసం వరకే వ్యాఖ్యానాన్ని వ్రాయగలిగారు. 1990 సెప్టెంబర్ 1న ఆచార్య తిరువడిగకు యీ అసంతృప్తితోనే పయనమై వెళ్ళిపోవలసివచ్చింది వారికి పాపం.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు యీ అనితరసాధ్య వ్యాఖ్యలను ముద్రణను 1988లో ప్రారంభించి 2008కి పూర్తి చేయగలిగారు.

**పుట్టపర్తి కీర్తికాయులైన తదనంతరం :**

ఆచార్యులవారి శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకుని పుట్టపర్తి వారి పద్య, గద్య సాహిత్యాలను మూడు సంపుటాలుగా అవిభక్త ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతికశాఖ ప్రచురించింది. అలాగే పుట్టపర్తివారి 1001 అష్టాక్షరీకృతులను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ

ప్రాచ్యలిఖిత గ్రంథాలయం మరియు పరిశోధనాలయం ప్రచురించింది. ఈ బృహత్ ప్రచురణలకు ప్రేరణగా అప్పటి అధికార భాషా సంఘాధ్యక్షులు, ప్రముఖ రాజకీయవేత్త శ్రీమాన్ మండలి బుద్ధప్రసాద్‌గారు కాగా. శ్రీయుత ఎన్. ముక్తేశ్వరరావుగారు, రాళ్ళబండి కవితా ప్రసాద్, ఆచార్య శ్రీపాద సుబ్రహ్మణ్యంగారి అధికారిక నేతృత్వంలో యీ ప్రచురణలు వెలుగులోకి వచ్చాయి. అమెరికా వాస్తవ్యులు, సామాజిక సేవా దురంధరులు శ్రీమాన్ కాశీనాధుని సాంబశివరావు, శ్రీమతి రాధ గారల వదాన్యతతో "పుట్టపర్తి విమర్శ తరంగిణి" (రెండు భాగాలు) కూడా ప్రచురిత మవటం ముదావహం.

పుట్టపర్తివారి సంపూర్ణ సాహిత్య సర్వస్వాలకు సంపాదకత్వ బాధ్యత వహించి యీ వ్యాస కర్త్రి వినయ విధేయతలతో సాహితీలోకానికి కృతజ్ఞతలతో సమర్పించుకున్నారు.

**ఉపసంహారం :**

ఇలా కవిగా, విమర్శకునిగా, కథ - నవలాకారునిగా, వాగ్గేయకారునిగా అనువాదకునిగా, అసాధారణ ప్రసంగకర్తగా వివిధ రూపాలలో తన సారస్వత త్రివిక్రమ పరాక్రమంతో భారతీయ సాహిత్యాన్ని ప్రభావితం చేసిన పుట్టపర్తి నారాయణాచార్యవర్యుని గురించి వ్యాఖ్యానించాలంటే వారిలా పదునాలుగు భాషలలో పట్టును సాధించిన మరో పండితవర్యుడు యిలపై అవతరించవలసిందే! 'సరస్వతీపుత్ర' అన్న బిరుదుతో వారి సాహిత్యజీవనం ప్రారంభమైనా అటుతరువాత ఆ వాగ్దేవే తన ప్రియ తనయుని పాండిత్య ప్రకర్షకు మురిసి- తానే యీ కుమారునిగా మారి - యిలపై "పుంభావ సరస్వతి"గా సంచరించి దివికేగిందనే పండితవర్గాల ప్రగాఢ విశ్వాసం.

ఇతిశమ్!